



1980 ఫిబ్రవరి

సంచికలో

అందించబడిన

పూర్తి నవల



★

# నదిలో నావ

రచన : చెల్లూరి సీతారాజేశ్వరరావు

సూపర్ ఎక్స్‌ప్రెస్ ఆగిపోయింది. చెడిపోయి కాదు.

రైల్వేగేటు అప్పుడే మూయబడింది. డ్రయివర్ వి
యింజను ఆపుచేశాడు. చల్లగాలి ఆగిపోయి వుడకబో
కాపడంతో ప్రయాణీకులు బాహ్యంలోపడ్డారు. పన్నె
ఎండ పిచ్చివాడికోపంలా వుంది.

బస్సులో విసుగులూ, చిరాకులూ రైల్వేలపై దండ
చంటిపిల్లల ఏడ్పులూ ఎక్కువయ్యాయి.

"నరకం. నరకం" అంది బస్సు ప్రజ.

"స్వర్గం" అంది రైలుగేటుకి ఎడంవైపు
గుడిసె. ఆ గుడిసె పేరు బాలాజీ విలాస్. అర్థా
ఆగిపోతే దానికి చైతన్యం వస్తుంది.

"సీనూ....బస్సుకాడికి పావరా?" ముత్యా
చింపుతూ పెద్దగా అరిచాడు.

సీను సిల్వర్‌కేసు నెత్తిమీద పెట్టుకు
బయటకి వచ్చాడు. అప్పటికే సూపర్ ఎక్స్‌ప్రెస్
ప్యాసింజర్లు రెండు టాక్సీలు ఆగివున్నాయి. లోపల
కొంతమంది రోడ్డుప్రక్క నీడలో నిలబడివున్నారు.

"బటర్ మిల్కు, కూలింగ్ కూలింగ్" సీను
చుట్టూ అరుస్తున్నాడు. ఎక్స్‌ప్రెస్‌లో వెనక సీట్లో కూర్చు
కిటికీలోంచి తొంగిచూసి "ఓరబ్బీ సోడా దొరుకుద్దా?"
వేశాడు.

ఇంతగా అరుస్తున్నా బేరం తగలకపోవడం సీను
వుంది. క్రింద తారురోడ్డు వేడికి కాళ్ళు వూడిపోతున్నాయి.
రాత్రే తెగిపోయాయి.

"మజ్జిగ మాత్రం దొరుకుతుంది."

"ఎంతేటి?" రైతు అడిగాడు.

"అరవై పైసలు....యివ్వనేటి,"

"మజ్జిగ అరవైపైసలా?" రైతు ఆశ్చర్యంగా అ

"మంచినీళ్ళు కూడ అరవైపైసలకి అమ్ముతున్నా

వాళ్ళలో. దానికేటిసేస్తావూ?" సీను అర్థంలేని సొద ఎందుకని విసుగ్గా ముందుకు నడిచాడు.

పదినిముషాలైనా రైలు రాలేదు. గేటు తీయలేదు. ప్రయాణీకులకి అశాంతి, దాహం ఎక్కువయ్యాయి. అరవైపైసలయినా ఆరు కేసులు అంటే అరవై సీసాలు అమ్మాడు సీను. అయినా ఇంకా రద్దీ తగ్గలేదు. 'ఇలా రా?' 'ఇక్కడ' "తొందరగా తే...." అంటూ కేకలు!

రైలు వెళ్ళింది. బస్సులు హారన్లు కొడుతున్నాయి.

మొదటి నుంచి బేరం చేసిన రైతుకి సరిగ్గా యిప్పుడు త్రాగాలనిపించింది. రెండుసీసాలు పుచ్చుకున్నాడు. బస్సు బయలుదేరింది.

"బేగా కానియ్...." సీను బస్సు అంచున పరుగెడుతున్నాడు. రైతు యింకా తాపీగా త్రాగుతున్నాడు.

బస్సు క్రాస్సింగ్ దాటింది. స్పీడు అందుకుంటోంది. సీను బస్సు దబదబ కొట్టాడు 'డ్రయివరయ్యా....ఆపు....' అంటూ.

సీను పరుగెత్తలేకపోయాడు. బస్సుపరుగు వేగం పెరిగింది కాబట్టి.

బండబూతు తిట్టుక్కుంటూ వెనక్కి తిరిగాడు. ఎక్కువ అమ్మినందుకు ముత్యాలుచేత ప్రశంసలు అందుకోవాలనుకున్నాడు. చివాట్లు పడతాయి రూపాయి యిరవైపైసలు నష్టానికి. సీను బిక్కముఖం వేశాడు.

ఇంకా హోటలు ఫర్లాంగు దూరంలోవుంది. సీను రోడ్డు ప్రక్కన తూముమీద కూర్చుని బీడీ వెలిగించాడు మిగతా డబ్బు లెక్కపెట్టాడు. సరిగ్గానే వుంది. జరిగిందానికి ఏం చెప్పడమాని ఆలోచించాడు. ముత్యాలు అనుమానం మనిషి. నిజం చెప్పినా నమ్మడాయె.

సీను ఖాళీకేసులు నెత్తిన పెట్టుకుని హోటల్లోకి వచ్చాడు. ఖాళీ పాలబిందెల సైకిళ్ళు నాలుగు అడ్డంగా పెట్టివున్నాయి. ముత్యాలు ప్యాసింజర్లతో వడగాడ్పుల గురించి చర్చిస్తున్నాడు. సీనుని చూసి "బస్సులుకూడ పోయినావేంరా?" అనడిగాడు.

సీను మాట్లాడలేదు. ఖాళీసీసాలు బయటకు తీసి గోలెంలో పడేశాడు. డబ్బుతీసి ముత్యాలుకి యిచ్చాడు. ముత్యాలు లెక్క పెడుతూంటే, తదేకంగా చూస్తున్నాడు. ముత్యాలుపని పూర్తయింది.

"రెండు తక్కువస్తున్నా యేం?"

సీను చెప్పాడు.

"బస్సు ఆపలేదాడు" సంజాయిషీగా అన్నాడు.

"బయలుదేరాకా నిన్ను ఎవడిమ్మన్నాడ్రా ఎదవా? రెండేళ్ళ నుంచి ఏడుస్తున్నా తెల్వీరాలేదంట్రా."

"ఎక్కువగా అమ్మడంవల్ల రద్దీ అయిపోనాది."

"సంచీ లాబం పిల్లి పూడ్చింది గదా? సన్నాసెదవ?" ముత్యాలు పళ్ళు నూరుతూ ప్యాసింజర్ల వైపు తిరిగాడు. "సూడండయ్యా... మా ఎదవ తెలివి. ఇలాగైతే ఏపారాలు ఏం బాగుంటాయి? ఏం బాగుపడి సత్తాం?"

ఎండలో యింత కష్టపడినా. తిట్లు తినడంలో సీనుకి, పద్నాలుగేళ్ళ సీనుకి రోషం ముంచుకువచ్చింది. "పొరపాట్లు రావేటి?" అన్నాడు.

"రాకూడద్రా సచ్చినెదవా?" ముత్యాలు లెంపలు వాయించాడు. కసితీరక తన్నాడు. నడుం వంచి గుద్దేడు.

సీను ఏడుస్తున్నాడు. ప్యాసింజర్లు చోద్యం చూస్తున్నారు.

పప్పు రుబ్బుతున్న పుష్ప ఆ చేతులతోనే పరుగెత్తుకు వచ్చింది. తండ్రి నుంచి సీనుని విడిపిస్తూ "యిక సాల్లే .. కొట్టుకుంటూ నట్టం తీరతాదేంటి" అంది.

"ఒళ్ళు దగ్గరెట్టుకో. సంపేయగల్ను" ముత్యాలు టీ చెయ్యడానికి కదిలాడు.

"నడవరా" పుష్ప వాడ్ని లోపలకి తోసింది. కనపడకుండా ద్వారానికున్న గోనె పూర్తిగా లాగింది. సీను యింకా దెబ్బల మంటలో వున్నాడు.

పుష్ప చేతులు కడుక్కుంటూ "వన్నం బోంసేద్దిగానిరా. అయ్య సంగతి సీకు తెల్సును గదరా. జాగ్రత్తగా వుండలేవట్రా....ఎందుకు

తింటావు దెబ్బలు" అంది.

సీను ముఖం తోల్చుకుని వేపచెట్టు కింద కూర్చున్నాడు. ప్రక్కనే పందిరి వుండటంతో చల్లగా వుంది. పుష్ప అన్నంమీద గొయ్యలపులుసు పోసి వాడిముందు పెట్టింది. "బేగా తిను: మెయిల్ వొచ్చే వేళవుతున్నది."

ముత్యాలు దృష్టి గేటు మూసెయ్యడం పైనే వుంటుంది. అది గాపి వుంటేనే తనకి లాభం. ముత్యాలుకి అరవై యేళ్లుంటాయి. ఈ మధ్యనే భార్య పోయింది. మొన్నటిదాకా ఒక ఫ్యాక్టరీ సేడవున్‌లో నైట్‌వాచర్‌గా వుండేవాడు. మరొకడితో కలిసి చాటుగా దోచెయ్యడం నేర్చుకున్నాడు. ఇలా కొన్నాళ్లు సాగేక పాపం పండింది. యింటికి పొమ్మన్నారు. ఏం చెయ్యాలో ముత్యాలుకి తోచ లేదు. దగ్గర కొంతసొమ్మున్నా, అది ఖర్చవకుండా తను స్థిరపడాలి. ఎలా?

ఓ స్నేహితుడి సలహా ప్రకారం రైల్వేగేటు దగ్గర హోటలు పెట్టాడు. అది టవున్‌కి చివర. చుట్టూరా పొలాలు, తోటలుతప్ప మరేం లేవు. జీ.టి. రోడ్డు కావడంతో ట్రాఫిక్ ఎక్కువగా వుంటుంది.

స్థలం తనది కాకపోయినా రేకులతో షెడ్డు వేశాడు. ఎదర పెద్ద మర్రిచెట్టు. బయటకూడ కొన్ని బల్లలు వేశాడు. ఎదర హోటలు వెనకాల మకాం.

హోటలు రాత్రీ పగలూ పనిచేస్తూనే వుంటుంది. రాత్రి లారీలు ట్రాఫిక్ ఎక్కువ. పుష్ప, సీను పడుకున్నా ముత్యాలే నిర్వ హించుకుపోతాడు. పనంతా మొదట్లో తండ్రీ, కూతురే చేసుకునేవారు. ఓ కంకర లారీడ్రైవర్ 'ఈడెవడో లగాడిమీద తొంగున్నాడు. జెరంగా వున్నాడేమో వణుకుతున్నాడు' అని గతంలో సీనుని హోటల్ ముందుంచి వెళ్ళిపోయాడు.

తనకీ మనిషి అవసరమే అనిపించింది. బస్సు దిగి అందరూ హోటల్‌కి రారు. బస్సు దగ్గర అమ్మడానికి పనికి వస్తాడని జ్వరం తగ్గాక సీనుని ఆగిపోమన్నాడు. సీను బికారీరాముడు. ఒప్పుకున్నాడు.

అలా రోజులు గడుస్తున్నాయి.

# 2

సాయంత్రం నాలుగు గంటలయింది. ఎండవేడి తగ్గింది. కొండలమీదనుంచి చల్లటి గాలి దొర్లుకుంటూ వస్తోంది. ముత్యాలు ఎనిమిదిమైళ్ళ దూరంలో వున్న సంతకి కూరలు కొనడానికి బయలు దేరాడు. అది అంతగా ట్రాఫిక్‌లేని టైం. హోటలు పుష్పకి అప్ప చెప్పి "బేగా వస్తాను. సరిగ్గా సూసుకోండి" అంటూ లారీ ఎక్కాడు.

ముత్యాలు బయటకి వెళ్లాడంటే సీనుకి పండగే. ఏదో కారణం చెప్పి వాడూ బయటపడిపోతాడు. పుష్పదగ్గర వాడికి చనువుం అభిమానముంది.

"అయ్య రాకుండా వచ్చేయాలి" తోటల్లోకి పరుగుతీస్తున్న సీనుని కేకేసింది.

సీను పరుగెడుతూనే తలూపాడు.

పుష్ప 'కవుంటర్'లో కూర్చుంది. ట్రాన్సిస్టర్ నొక్కింది. హిందీ పాటలు వస్తూంటే కూనిరాగం తీయసాగింది.

మోతపెడుతూ ఒక పాత అంబాసిడర్ వచ్చింది.

"నిన్ను చూడగానే నా కారుకి వుషారు వచ్చేసిందే." భీమయ్య డోర్ తన్ని కారు దిగేడు పుష్పని మైకంగా చూస్తూ.

పుష్ప సర్దుకుని కూర్చుంది. భీమయ్యని చూసి ముఖం చిట్లించింది. తమది నలుగురూ వచ్చే యిల్లు. అందరి దృష్టి తనమీద పడుతుంది. భీమయ్యలాంటి వారులేని చనువు తీసుకుని ముందుకు రావాలనుకుంటారు?

ఎందుకు? పుష్పకోసం. ఆమె వయసులో వుంది కాబట్టి. ఇంకా మనువు కాలేదు కాబట్టి.

పుష్ప వికసించిన పుష్పంలా వుంటుంది. నల్లగావున్నా నిగనిగ లున్నాయి. జలపాతంలా రొదచేసే వయసుంది. పుష్ప చదువుకోలేదు. సినిమాలు చూసి నేర్చుకున్న సంస్కారముంది. అందంగా కనపడా లన్న తపన వుంది.

భీమయ్య సిగరెట్ తీసి పొయ్యిలో నిప్పుతీసి వెలిగించి "నీ

బాబు లేడేటి?" అన్నాడు బల్లమీద కాళ్లుపెట్టి కూర్చుని.

"సంతకి ఎల్లిండు."

భీమయ్య ఘోరంగా నవ్వేడు. "మంచి సమయం మాట."

పుష్ప మండిపోతూ లేచింది "దేనికి? నీ దివసాయానికా?"

భీమయ్య ఆఖరిదమ్ము లాగి సిగరెట్ పడేశాడు. "ఎర్రకోక కట్టినపుడే అనుకున్నా. గుంట కోపంగా వుంటుందని. సరేగాని టెందర టిఫిన్ పడేయి. ఆకలి గోరంగా వుంది. మా ఓనర్‌గాడి కాలంగా మీల్సు లేదీవాళ. మళ్లా గూడెంపోయి రావాళ."

"ఏం కావాలేటి?" బీరువా దగ్గర్నుంచి అడిగింది.

"నువ్వేం యిచ్చినా అమురుతం గదా!"

"ఏడిసావ్" అనుకుంది పుష్ప. రొట్టె సగానికికోసి చట్నీవేసి నీళ్ళగ్లాసుతో బల్లమీద పెట్టింది.

"నా ఆకలి దానికే తీరిపోతుందా?" ద్వంద్వంగా నవ్వాడు.

"అంటే...."

"బుల్లెమ్మా మరో రెండు రొట్లయినా లాగించేగల్ను. లేవా?" తినడానికి వుపక్రమిస్తూ అన్నాడు.

"ఎందుకు లేవ్....తిను....ఏత్తాను."

"రచ్చించావ్."

పుష్ప పెరటివైపుకి తొంగి చూసింది. సీను రావడంలేదు. పొయ్యిమీద కాలుతున్న రొట్టె తీసి మరలా పిండి వేసిపెట్టింది.

"వేడిగా వుంది నీలాగే....సెట్నీ పడేయించు."

"నీకు కావలసినదేదో తినిపో. వాగమాక" కసురుకుంది.

"నీ ముందు మూగ నోమా? నావల్ల కాదు."

అందరూ ఆకలివేసే ఆ హోటల్‌కి రారు. భీమయ్య ఆ లైన్‌లో తిరుగుతూంటాడు. పుష్పని చూసి పురుగు రొదచెయ్య సాగింది. అప్పట్నుంచి పని వున్నా లేకపోయినా గంటల తరబడి ఆగిపోయి ఆమె కసరుకుంటున్నా, మండిపడుతున్నా మాటలు సాగి స్తూనే వుంటాడు. ఏదోవేళ కాలం కలిపి రాకపోతుందాని.

ఇలాంటి భీమయ్యల వెకిలితనం గురించి గతంలో ఒకసారి

తండ్రితో చెప్పింది పుష్ప.

"రావద్దంటే మన యాపారం డవున్ అయిపోతది. మనమే జాగ్రత్తగా వుండాల." అన్నాడు ముత్యాలు.

అంటే తనే సమాధానం చెప్పాలి. తనదే పెత్తనం.

ఎవరి సాయం అందదన్న మాట. అయినా పుష్పకి భయం లేదు. తనమీద తనకి బోలెడంత భరోసా!

"స్ట్రాంగ్‌గా టీ చెయ్యి" భీమయ్య బయటికిపోయి చెయ్యి కడుక్కొని టీ స్టాండు దగ్గరకి వచ్చాడు.

పుష్ప కుంపట్లో బొగ్గులు సరిజేసి, లోపలనుంచి పాలు తెచ్చి గిన్నెలో పోసి భీమయ్యకి టీ తయారుచేసి యిచ్చింది.

"చల్లగా వుంది" భీమయ్య చప్పరిస్తూ అన్నాడు.

"పాలు పోయినా కాస్త."

"వద్దులే" సిగరెట్ వెలిగించి బల్లపై కూర్చున్నాడు.

పుష్ప లోపలకి వెళ్ళింది సీను కేకవేస్తే. సీను మామిడి కాయలు క్రిందపోసి "పుల్లగా వున్నయి. వరేసి తింటే శానా బాగుంటాయి" అన్నాడు.

"ఎడవివా?"

"రైలు బద్దిలుకాడ సెట్టువి. సెంద్రయ్య కోసుకోమన్నాడు."

"బల్లలు సర్ది, వాకిల తుడిచెయ్యి. అయ్య వస్తే తిడతాడు" మామిడికాయలు తీసి లోపల పెట్టింది.

సీను చీపురుతో వెళ్ళాడు.

పుష్ప రాత్రి వంటకి పెరటిలోని పొయ్యి అంటించింది. ఎసరు పెట్టడానికి గిన్నె తొలుస్తుండగా గోలెం దగ్గర కాలు జారింది. దెబ్బ తగల్లేదు కాని అక్కడ అంతా బురద కాబట్టి చీర పాడైంది.

పుష్ప చీర తీసివేసింది. వేపచెట్టుకి మధ్యాన్నం కట్టిన నీలం చీర ఆరి ఎగురుతూంది. పుష్ప చెట్టు దగ్గరకి నడిచింది.

భీమయ్య గుమ్మంలో గోనెతీసి నిలబడిపోయాడు. నిర్ఘాంతపోయాడు. నిరుత్తరుడయ్యాడు. ఆకుపచ్చటి రవిక, తెల్లటి లంగాలో పుష్ప

పుష్పకి చీరముడి తొందరగా రాలేదు. గాలికి చీర పైకి లాక్కుపోతోంది. పాదాలపై ఎత్తింది. ఒక చేత్తో చెట్టుపై సాకి అందుకోసాగింది.

చీర అందడం, గుమ్మంలో భీమయ్య కనపడటం ఒక్కసారి జరిగినాయి. పుష్ప చీర మీద కప్పుకుని "నీకు ఈడేం పని?" ఆవేశంగా అడిగింది.

"బిల్లు ఎంతయిందోనని" భీమయ్య మాట మార్చివేశాడు.

"బయటుండు. సెబుతా....సిగ్గులేని జనము."

భీమయ్య గోనె పడేసి నడిచాడు. పుష్ప చీర కట్టుకుని వేగిరం వచ్చింది. భీమయ్య బయట చెట్టుదగ్గరున్నాడు.

"మూడూ ముప్పావలా యివ్వు" పుష్ప చెప్పింది.

"రేపిస్తాలే" విసురుగా కారుకేసి నడిచాడు.

పుష్పకి శివం ఎత్తింది. రోజూ వచ్చేవాడే కాబట్టి అరువు యిచ్చినా తండ్రి ఏమనడు. కాని భీమయ్య నిర్లక్ష్యానికి మండిపోయింది.

"ఇదిగో మాట" సౌమ్యంగా పిలిచింది.

భీమయ్య ఆశ్చర్యంగా దగ్గరకి వచ్చాడు ఆ మార్పుకి వివశమవుతూ.

"గూడెం పోతున్నావా? పవుడరు డబ్బా తెచ్చిపెట్టు" అంటూ గల్లాపెట్టి దగ్గరకెళ్ళి తొంగిచూసి "రెండు పదులున్నాయా? ఇరవై నోటు యిత్తా" అంది.

ఆమె అలా మాట్లాడం భీమయ్యకి తెగ సంతోషంగా వుంది. పర్సు తీసి రెండు పదులు డ్రాయరుమీద పడేశాడు.

"ఏ రకం కావాలి? జైప్రవరాసే పవుడర్ తేనా?"

"నీకు తెలీదేటి?" పుష్ప ఓరగా నవ్వింది.

ఓ పది నోటు లోపల పడేసి ఆకుంబావలా తీసి డ్రాయరుమీద పెట్టి "నీ డబ్బు తీసుకో. పవుడ్రూ గివుడ్రూ అక్కర్లేదు. మా అయ్య లేనపుడు బాకీలు పెట్టక" అంది సీరియస్‌గా చూస్తూ.

భీమయ్య ఖంగు తిన్నాడు. కాని వెర్రిముఖాన్ని సర్దుకోడానికి

నవ్వి "నీకూ తెలివి వుంది" అంటూ పరుగున కారెక్కాడు.

"గుంట అవకాశం వస్తే చక్రం తిప్పేయగలదు" విండోలో నుంచి కసిగా చూస్తూ స్టార్ట్‌చేసి యాక్సిలేటరు నొక్కాడు.

పుష్ప పక్కన నవ్వింది.

"ఏమైందే....అప్పా?" తుడవడం ఆపి సీను అడిగాడు.

3

ముత్యాలు రాత్రి నిద్రపోడు గాఢంగా. ఎప్పుడే బేరం వస్తుందని ఎదురుచూస్తూంటాడు. ఒకవిధంగా చెప్పాలంటే అతడి రాత్రి వ్యాపారమే ఎక్కువ. లారీ డ్రయివర్లు, క్లీనర్లు మందుమీద దెయ్యంలా తినేస్తారు. కొంతమంది తిరిగి యిచ్చిన చిల్లరకూడ తీసుకోలేరు. టీ, టిఫిన్లే కాకుండా పట్నంనుంచి మందు తెచ్చి దానికి నీళ్ళు జోడించి కొత్త సీసాల్లోకి బిగిస్తుంటాడు ముత్యాలు. ఇన్ని లాభాలు ఎదురు చూస్తుంటే నిద్ర ఎలా పడుతుంది?

ఆ రాత్రి వులిక్కిపడి లేచాడు ముత్యాలు. వ్రేలాడదీసిన పెట్రొమాక్సులైటు మందంగా వెలుగుతోంది. దాన్ని దింపి గాలి కొట్టాడు.

చుట్టూరా నిశ్శబ్దంగా వుంది. పెద్ద రోడ్డు ఖాళీగా వుంది. ముత్యాలు రోడ్డుమీదకి వచ్చాడు. హెడ్‌లైట్స్ కనిపించడం లేదు. పొలాల్లో నుంచి పల్లెలో దీపాలు మాత్రం చుక్కల్లా కనిపిస్తున్నాయి.

ముత్యాలు తిరిగివచ్చి కుర్చీలో కూర్చున్నాడు. పాత అలారం రెండున్నర చూపిస్తోంది. ముత్యాలు కళ్ళు మూసుకునేలోపల రోడ్డు మీద బస్సు రొద. ఎవరో కేకవేస్తున్నారు. ముత్యాలు ఎదరకి నడిచాడు.

"టీ వుందా?" టూరిస్ట్ బస్సు కండక్టరు అడుగుతున్నాడు.

"రండి....వేడి వుప్మాకూడ వుంది."

బస్సువాళ్ళతో పాటు ప్రయాణీకులు నలభై మంది దిగారు. వాళ్ళని సమర్ధించడం ముత్యాలుకి చేతకాలేదు. వెళ్ళి సీనుని లేపాడు. వాడికి నిద్రలో లేవడం తగని బద్ధకంగా వుంది.

"గలాసులు, పళ్ళేలు కడుక్కురారా ఎదవా? అడ జనం కరిసే

త్తున్నారు" ముత్యాలు తిరిగి కవుంటర్ దగ్గరికి పరుగెత్తాడు.

ముత్యాలుకి లాభాలు వస్తాయని ఆశ వుంటుంది. సీను పని వాడు. వాడి జీతం ఎప్పుడూ నెలకి యిరవై రూపాయిలే.

ప్యాసింజర్లు యాత్రనుంచి వస్తున్నారు కాబట్టి ఆకలిమీద వున్నారు. సీను ప్లేట్లు కడిగే ఆలస్యం కూడ భరించలేకపోతున్నారు. వాళ్ళ సందడి చూసి ముత్యాలు టీ చేస్తూనే తిట్లు "వేగా రారా దిన వకంత్రీ నా కొడకా!"

ముత్యాలు ఎనిమిది గ్లాసులతో టీ తయారుచేశాడు. కొంత మంది చోటులేక బయట వున్నారు. "ఆళ్ళకిచ్చిరా?" సీనుకి పురమాయించాడు.

సీను టీలు యిస్తూంటే ఓ వ్యక్తి దిక్కులు చూస్తూ అందుకున్నాడు. జారి టీ మీద వలికింది. తనది తప్పయినా "ఏరా కళ్ళు మూసుకుపోయాయా? సరిగ్గా అందివ్వలేవూ?" అంటూ కేకలువేశాడు.

ఈ గొడవ చూసి "ఏం జరిగింది బాబూ" అంటూ ముత్యాలు అక్కడికి వచ్చాడు. చుట్టూరావాళ్ళు కొండంతచేసి చెప్పారు.

"నాకేం తెలీదు" అని సీను అంటున్నా ముత్యాలు వినలేదు.

తిట్టాడు. తన్నాడు. కొట్టేడు.

ముత్యాలు కొట్టడం పూర్తయ్యాక విడదీశారు "సాల్లే" అంటూ.

యాత్రాస్పెషల్ వాళ్ళు నెమ్మదిగా బస్సుకేసి నడిచారు. ఆర్గనైజరు ముప్ఫయితొమ్మిది రూపాయిల బిల్లు చెల్లించాడు. ముత్యాలు కమీషన్‌గా అతడికి 'నాలుగు రూపాయిలిచ్చాడు. ఆర్గనైజర్, 'మళ్ళీ ట్రిప్పులో యిక్కడికే లాక్కొస్తాను జనాన్ని' అన్నాడు.

"మీ దయ" బయటకొచ్చి సాగనంపాడు ముత్యాలు.

సీను బిల్లలు తుడిచేసి గుమ్మంలో నించున్నాడు.

"పని చేసేటప్పుడు సచ్చిపోతావేరా? తినేటప్పుడు ఈ ఏడుపు రాదేం? వురేయ్ సీనూ. నీ వరసేం బాగాలేదు. పనికాడ దొంగేసాలు ఏశావంటే చెమించను నేను. రాచ్చసిముండా వాడ్ని పనిదగ్గర. గురుతు ఎట్టుకో....పోయి తొంగో....యింకా సీకటుంది."

సీను లోపలకి పోయాడు.

ముత్యాలు టీ తయారు చేసుకుని త్రాగి సిగరెట్ వెల్గించాడు. నాలుగు దాటింది. దూరంగా కోళ్ళుకూస్తున్నాయి.

చెట్నీ తయారుచెయ్యడానికి పచ్చిమిర్చి బాగుచెయ్యసాగేడు. పుష్ప కళ్ళు నలుపుకుంటూ వచ్చింది. "ఆ కేకలు ఓరిమీద. సీనుగాడి మీదా?"

ముత్యాలు బూతులు తిడుతూ జరిగింది చెప్పాడు:

ఎదవ మడుసులు. ఆడు సిన్నోడు కనక తలోరాయి యిసిరారు. అదే పదిరోజులు ఎనుక తాను సెట్నీవేస్తూ పట్నంబాబు కోటు మీద పడేసింది. 'సెమించండి బాబూ' అని తను అంటున్నా 'పర్లేదు.. దీనికేనా....ఏం పోయింది' అన్నాడు నవ్వి తుడుచుకుంటూ. 'నువ్వే తుడవరాదుటే పిల్లా' అని అక్కడున్న ముసలి డ్రయివరు పరాచికాలాడేడు. కోటుబాబు ఎంత యిదిగా చూశాడూ?

"కాఫీ....త్రాగరాదూ....నిద్రపోతాది" అన్నాడు ముత్యాలు.

పుష్ప మాట్లాడలేదు. ఆమె ఆలోచనలు మరోవైపుకి జారిపోయాయి. కాని ఏం సమాధానపడలేక బయటకి తెచ్చింది.

"బావయ్య యింకా రానేదు. సుక్రవారం వస్తానని వుత్రుం పడేశాడు కదా!"

ముత్యాలు వుల్లిపాయలు చాకుతో కోస్తున్నాడు. ఆ పని ఆపి కూతురి ముఖంలో చూశాడు. "పిచ్చిముకమా....కాస్త యిటు అటు కాదేటే ప్రయాణాల్లో. ఆడ అన్నీ సూసుకుని రావాలా మరి."

ధృవుడు ముత్యాలు మేనల్లుడు. హైద్రాబాదులో ఒక పళ్ళ వ్యాపారి దగ్గర డ్రయివర్‌గా వుంటున్నాడు. ఒకసారి రాజమండ్రి నుంచి తెస్తున్న అరటిపళ్ళ గెలల్లో దారిలో కొన్ని జారిపోయాయి. వాటి ఖర్చు సేటు ధృవుడుకి అంటగట్టాడు. అప్పట్నుంచి యిద్దరికి పడటంలేదు. మరోచోట నవుకురీ చూసుకోవాలనుకుంటున్నాడు.

ముత్యాలు తమ దగ్గరకి వచ్చేయమన్నాడు.

ముత్యాలు పదివేలు నిలవేశాడు. ఆటో కొని యిస్తానన్నాడు. తనకి మాత్రం ఎవరున్నారు? పుష్ప తప్ప. అది పుట్టగానే వాడి పెళ్లా

మయిపోయింది. పెళ్ళి చేసేస్తే అంతా ఒకచోట వుండొచ్చు.

ధృవుడు వచ్చేస్తానని రాశాడు.

అతడి రాకకోసం ఆత్రపడుతోంది పుష్ప. శుక్రవారం దాటి పోయిందికూడ. ఏ లారీ ఆగినా 'బావయ్యే' అనిపిస్తోంది. కాని కావడం లేదు.

"ఇవాళో రేపో వచ్చేస్తాడే!" ముత్యాలు జోస్యం చెప్పాడు.

తండ్రి మాటతో బలం తెచ్చుకుంది పుష్ప. ఈపాటికి ప్రయాణంలోనే వుంటాడని సమాధానపడింది.

బావయ్య రాగానే ఎగ్జిబిషన్‌కి ఎల్లాల పట్నం. ఆడ ఎన్నో యిసిత్రాలుంటాయంట. ఎన్నో దుకాణాలంట.

నెమ్మదిగా వెలుగురేకలు విచ్చుకున్నాయి. తూర్పున సూరీడు పుట్టాడు. తిరిగి చైతన్యం ఏర్పడింది.

అందరికీ మామూలుగా తెల్లవారింది. సీనుకి భళ్ళున తెల్లవారింది. రాత్రి అంతమందిలో జరిగిన అవమానం వాడ్ని కాల్చివేస్తోంది. మనస్సు బాధగా మూల్గుతోంది. వాళ్ళ వెటకారాలు గుర్తు రాగానే గగుర్పాటు కల్గుతోంది.

"ముసలనా కొడుకు సీటికీ మాటికీ సెయ్యిచేసుకుంటున్నాడు. గతిలేని ఎదవననుకుంటున్నాడేమో. సూపిత్తా తడాఖా" వేపపుల్ల నములుతూ నిశ్చయించుకున్నాడు.

బస్సులు ఆగుతున్నాయి. వెళుతున్నాయి. సీను తినుబండారాలు, కాఫీలు బస్సుల దగ్గరకి పట్టుకెళుతున్నా చురుగ్గా అమ్మడం లేదు. కావాలనే ఆలస్యం చేస్తున్నాడు. ఇంతలో బస్సు వెళ్ళిపోతోంది. సరుకు మిగిలిపోతున్నది. ఇలా మధ్యాన్నందాకా కోల్డ్ వార్ సాగించాడు సీను.

"దివసాయం ఎదవ .... ఆడకిపోయి నిద్రోతున్నావేంటిరా? సెకసెకా అమ్మేయొద్దూ. దిష్టిబొమ్మల్లే నించుంటే అయిపోతాదా? నాలుగుమాటలు సెప్పాల" సరకు అమ్ముడు కానందుకు ముత్యాలు తిరిగి తిట్టిపోశాడు.

సీను కోపం మరింత ఎక్కువయింది. ప్రతీకారం పెద్దగానే

చెయ్యాలనుకున్నాడు. ఆలోచనలతో అన్నం సహించలేదు.

"కూడు తినటంలేదేం? టిఫినీ లాగించావా?" అనడిగింది పుష్ప.

సీను మాట్లాడలేదు. కంచం తోమి బల్లక్రిందపెట్టి హోటల్లోకి వచ్చాడు. జనం ఎవరూ లేరు. ముత్యాలు కవుంటర్లో నిద్రోతున్నాడు.

ఏం చెయ్యాలి? సీనుని దొలిచేస్తున్నది.

ఏం చెయ్యాలో సాయంత్రం తెల్సింది. సీను ఏటినుంచి నీళ్లు తెచ్చి అన్నిటిలోనూ నింపి లోపలకి వస్తూండగా బీరువా ప్రక్కన ముత్యాలు డబ్బు లెక్కపెడుతున్నాడు. సీను అది చూడగానే ఒక నిశ్చయానికి వచ్చాడు.

ముత్యాలు హోటల్‌పనిలో పడ్డాడు. పుష్ప వేపచెట్టు క్రింద వంట చేస్తోంది. సీను వంటగది రేకుతలుపు నెమ్మదిగా తీశాడు. అది చప్పుడు చెయ్యకుండా తెరచుకుంది. అది చిన్న గది. ఒక బీరువా. మంచం. దానిమీద పుష్ప పడుకుంటుంది. తాళాలు పరుపుక్రింద దొరికాయి.

బీరువా తీశాడు. పై అరలో చిన్న రేకుపెట్టి.... తెరవగానే రూపాయలు. సీను వణికాడు. భయంవేసింది. తమాయించుకున్నాడు. రేకుపెట్టి తీసి సంచీలో పెట్టి బీరువా మూసాడు. సంచీని తిరిగి నీళ్ళ బిందెలో పెట్టాడు. తిరిగి ఏటికి బయలుదేరుతున్నట్లు నడిచాడు.

"ఇంకా నీళ్ళు తేడం అవలేదంట్రా?" ముత్యాలు కేకవేశాడు.

"అయిపోయిందిలే...." అంటూ నడిచాడు ఏటికేసి. చీకటి పడింది. బిందె ఏటిలో పడేసి సంచీతో రైలుపట్టాలపై పరుగెట్ట సాగేడు ...

## 4

స్లిమత్ వేగంగా పోతున్నా వారికి సుఖంగాలేదు. ఒంటెద్దు బండి వెళుతున్నట్లు ఫీలవసాగేరు. ఒకరి తర్వాత ఒకరు డ్రయివర్ని హెచ్చరిస్తున్నారు. అవతల పెళ్ళి ముహూర్తం దగ్గరపడుతోంది. ఈ పాటికే ముకుందం తమగురించి ఆందోళనపడుతూంటాడు.

కారు వేగం హెచ్చలేదు. తగ్గసాగింది. తగ్గింది. ఆగిపోయింది.

డ్రయివర్ దిగి చూసేలోగానే వెనక శాస్త్రీలు "ఎందుకు ఆగిపోయింది? ఏం జరిగింది?" ప్రశ్నలు కురిపించాయి.

టాక్సీ డ్రయివర్ అయితే మీదపడి కరిచేవాడే. సొంత డ్రయివర్ కనుక ప్రొద్దుటినుంచి డ్రయివింగ్‌చేత అలసిపోయినా విసుక్కోలేక "మెకానిక్ రావాలండి" అన్నాడు.

వెనక శాస్త్రీలు జీరోలో వుండిపోయారు. తేరుకుని విసుక్కున్నారు. వెధవ ప్రయాణమని తిట్టుకున్నారు.

ఎదరగా లారీ వస్తోంది.

"అందులోపోయి టాక్సీలో మెకానిక్‌ని తీసుకురా. కారు తర్వాత బాగుచేయించుకుని వద్దువుగాని" అన్నాడు కారు యజమాని.

ఆయన పేరు నంబూద్రి. పీపా ప్రక్కన పీపా నిలబడినట్లు వుంటాడు. మనిషి లావు. అంతస్తు లావు. సన్నగా వుండేది ఆయన రోగిష్టి పెళ్ళాం మాత్రమే. వ్యవసాయాలూ, వ్యాపారాలలో నంబూద్రి పని పెళపెళలాడిపోతోంది.

"అలా చెయ్యి బాగుంటుంది" రామినీడు వంతపాడేడు.

లారీ దూరంగా ఆగింది. డ్రయివర్ ఎక్కగానే బయలుదేరింది. "తొందరగా రా" నంబూద్రి హెచ్చరించాడు.

నిశీధి. నిశ్శబ్దం. నిర్మానుష్యం.

ఇద్దరు సిగరెట్లు వెలిగించారు.

గాలి రేగింది. ధూళి ఎగురుతోంది. ఇద్దరూ కారులో కూర్చున్నారు. గాలి బలం తెచ్చుకుంది. సుడిగాలిలా మారింది. చెట్లు దెయ్యంలా వూగుతున్నాయి. మెరుపులు, బాంబులు పడినట్లు వురుములు.

"వాన కురుస్తుందా?" రామినీడు ఆదుర్దాగా అడిగాడు.

"అలాగే వుంది మరి."

దగ్గర్లో చెట్టు విరిగింది. ఆ శబ్దం యిద్దర్నీ భయపెట్టింది.

ఎండలోని అద్దంలా మెరపులు విరజిమ్ముతున్నాయి.

"ఇక్కడ చిక్కుకుపోయాం చూడు. ఇదంతా అడవిలాగ వుంది. ఎరక్కపోయి బయలుదేరాం పెళ్ళికి" రామినీడు వ్యాకుల

పడ్డాడు.

అతడు సుఖాల మనిషి. రాజకీయాల్లో పదవులు అందుకున్నాక మరింత సుఖపడుతున్నాడు. స్వంత వూరిలో పనివుందని హైద్రాబాదునుంచి వచ్చాడు. నంబూద్రి పెళ్ళికి వెళదాం నడవమన్నాడు. అవతల వ్యక్తి వుభయులకి పనికివచ్చేవాడే గనుక బయలుదేరారు.

వాన ప్రారంభమైంది.

కార్లో సుఖంగా లేదు. భయంగా వుంది. దగ్గరలో మెరవులలో ఓ రేకుల షెడ్డు కనిపించింది. "అక్కడికి పోదాం పద" అన్నాడు నంబూద్రి.

"తడిసిపోతాం."

"తడిసినా అక్కడికి పోతే నయం. ఏ చెట్టయినా మీదపడుతుంది యిక్కడ" నంబూద్రి సూట్ కేసు అందుకుని దిగాడు.

రామినీడు వెంటపడ్డాడు.

వర్షం తడిపేస్తోంది. వురుములు, సుడిగాలి అడుగుపడనీయడం లేదు. బయట ప్రపంచంలో పులులయినా, ప్రస్తుతం పిల్లుల్లా వున్నారు. ఒకర్ని ఒకరు కౌగలించుకుని భయభయంగా నడుస్తున్నారు. ఫర్లాంగు దూరంలోని షెడ్డు ఎంతో దూరమనిపిస్తోంది. పడుతూ లేస్తూ వచ్చి పడ్డారు.

జల్లు కొట్టకుండా డేరా దింపివుంది.

ఇద్దరూ తీసుకుని లోపలకి వెళ్ళారు. పెట్రొమాక్సు లైటు వెలుగుతోంది. పుష్ప కునికిపాట్లు పడుతోంది. చప్పుడుకి లేచింది.

"హోటలా యిది?" రామినీడు సాధికారంగా అడిగాడు.

"మరే. కూర్చోండి" అంది పుష్ప.

"టిఫిన్ వుందా?" నంబూద్రి అడిగాడు.

"వడలున్నాయి."

"వేడిగా ఏంలేదా?" రామినీడు అడిగాడు.

"ఉప్మా చేస్తాను కావలిస్తే."

ఇద్దరూ ఆకలిగానే వున్నారు. విందు భోజనం చెయ్యవచ్చని ఏం తిని బయలుదేరలేదు సాయంత్రం. పది గంటలు కావస్తోంది.

ఇక పెళ్ళి ఆశ ఎలాగ లేదు కాబట్టి టిఫిన్ తయారు చెయ్యమన్నారు.

పుష్ప పొయ్యి మీదకి మూకుడు ఎక్కించి పోపు వేయించి నీళ్ళు పోసింది. రవ్వడబ్బా కనిపించలేదు. 'అయ్యో' అంది గదిలోకి వెళ్ళి.

ఆ గదిలో చిన్న దీపం వెలుగుతోంది. ముత్యాలు మంచంమీద పడివున్నాడు. నిద్రపోవడం లేదు. "ఏం కావాలమ్మా?" అనడిగాడు.

"రవ్వ డబ్బా ఏడవుంది? పేసంజర్లు వచ్చినారు."

ఎక్కడ వుందో చెప్పాడు.

"నీకూడ కూసింత కాఫీ యియ్యనా....సందేళనుంచీ ఏం తీసుకోలేదుగా."

"ఏం వద్దేవ్ కూతురా!" ముత్యాలు మూల్గాడు.

అతడికి రెండు రోజులనుంచి జ్వరం. మందూ మాకూ మ్రింగుతున్నా ఏం గుణం కనిపించలేదు. శరీర బాధకంటె మానసిక బాధ ఎక్కువగా వుంది.

గడ్డి కరచి సంపాదించింది గద్దలా తన్నుకుపోయాడు.

సీను సాయంత్రంనుంచీ కనపడకపోయినా వాడిమీద అనుమానం రాలేదు. ఏ సినిమాకయినా పోయాడనుకున్నాడు. రాత్రి పదకొండు గంటలకి పంద రూపాయిల చిల్లరకోసం బీరువా దగ్గరకి పోయాడు. రేకుపెట్టె కనిపించలేదు. ఘొల్లుమన్నాడు. బిందె రేపెలో పడివుందని చంద్రయ్య తెచ్చియిచ్చాడు.

ఆశ చావక తెల్లవార్లు వాడికోసం వెతుకుతూనే వున్నాడు. తెలిసిన ద్రయివర్లతో చెబుతూనే వున్నాడు.

అంత డబ్బు సంపాదించడం మాటలా? వెక్కి వెక్కి ఏడ్చాడు.

"వూర్కో అయ్యా" పుష్ప ధైర్యం చెప్పింది.

అయినా ఆ బాధ ఆగింది కాదు. సీనుని శాపనార్ధాలు పెడుతున్నాడు. తిడుతున్నాడు. ఏడుస్తున్నాడు. హోటలు పని చెయ్యలేక పోయాడు. ఒళ్లు తెలియని జ్వరంతో మంచం ఎక్కాడు....భవిష్యత్తు శూన్యంగా వుంది. ఎండిపోయింది. పోగొట్టుకున్న డబ్బు కుదిప

వేస్తున్నది. "నా కొంప ముంచావురా నీసూ!"

రేపు ధృవుడు వచ్చేస్తాడు. ఆటో కొనిపెడతానన్నాడు. ఆడికేం చెయ్యగలడు? ఒటేలు పని అప్పగిస్తే ఆడు సేస్తాడా? పుష్పని మను వాడతాడా?

ముత్యాలుకి సందేహాలు, ప్రశ్నలు, భయాలు.

ఏదో ధైర్యం తెచ్చుకుని నిలబడదామన్నా పీలులేకుండా వుంది. ఇది అగాధం. తను దాటలేడు.

పుష్ప వుప్మా తయారుచేసి, టీ కలిపింది. నంబూద్రి, రామి నీడు బట్టలు మార్చుకున్నారు. బయట వాన కురుస్తున్న లోపల వెచ్చగా వుంది. ఆకలి తీరగానే యిద్దరూ బెంచీమీద యిరుక్కుని కూర్చున్నారు. ఇప్పుడు వాన అందంగా కనిపిస్తోంది. పుష్ప యింకా అందంగా కనిపిస్తోంది.

వాన వుధృతం మరింత యెక్కువయింది. రేకులమీద వాన పడి పెద్దగా చప్పుడవుతోంది.

"అయ్యో...." మూలుగు, పడిన చప్పుడు.

పుష్ప లోపలికి పరుగెత్తింది.

ముత్యాలు మంచం క్రింద పడివున్నాడు. మూల్గుతున్నాడు. 'అయ్యా' కంగారుగా తట్టి లేపింది. ముత్యాలు పలకలేదు. మంచం మీదకి ఈడ్చింది. నీళ్ళు కొట్టింది. అయినా ముత్యాలుకి స్పృహ రాలేదు.

చేతులు కాళ్ళు కొట్టుకోసాగేడు.

కాళరాత్రి, తండ్రి బాధ, పుష్పకి ధైర్యం జారిపోసాగింది. మధ్యాన్నం తెచ్చిన 'మందు' నోరు పెకలించిపోసింది.

అయినా గుణం కనిపించలేదు.

పుష్ప వాకిటిలోకి వచ్చింది కంగారుగా. "ఓరయ్యా....ఓసాలు లోనికి రండి. మా అయ్య అదోలా సూత్తన్నాడు."

ఒకర్ని ఒకరు చూసుకున్నారు. లేస్తే అంతా తడిగా వుంది. పుష్ప మరోసారి కేకవెయ్యడంతో లేచారు.

పుష్ప లైటు చూపించింది.

"డాక్టరుండాల. ఇప్పుడేం చేస్తావ్?" అన్నాడు నంబూద్రి, వాడ్ని చూసి.

పుష్ప వెర్రిగా చూడసాగింది.

"ఏం జబ్బే పిల్లా?" రామినీడు సిగరెట్ వెలిగిస్తూ అడిగాడు.

"జెరమే.... రెండ్రోజులయినాది."

ముత్యాలు కలవరింతలు కేకల్లోకి దిగాయి.

"మందు పడితేగాని రోగం తగ్గదు. ఇప్పుడు వైద్యుడు యెక్కడ దొరుకుతాడు?" నంబూద్రి బయటకి వెళ్ళిపోతూ అన్నాడు.

పుష్ప కూతురు. వానకి జడిసి ఆగలేకపోయింది. సంచీ వైద్యుడు రామస్వామి రానన్నాడు. మందిచ్చాడు.

## 5

వాన, చీకటి, ఏకాంతం భయపెడుతున్నా పుష్ప తండ్రిని రక్షించుకోడానికి మందుకోసం మైలుదూరంలో వున్న రామస్వామి యింటికి వెళ్ళింది.

వచ్చేటప్పుడు దారి కడ్డంగా చెట్టు, చీకటిలో పుష్పకి కనిపించ లేదు. పడిపోయింది. గాయం తగిలింది.

ఆ బాధకన్నా రామస్వామి యిచ్చిన మందు జారిపోవడం ఎక్కువ బాధగా వుంది. వెతికింది. చివరికి పగిలిన సీసాలో ఓ ముక్క దొరికింది. తిరిగి రామస్వామి దగ్గరకి వెళ్ళడం యెంత బాధో తెల్సు. అందుకే యింటికి బయలుదేరింది.

హాల్లో రామినీడు, నంబూద్రి నిద్రలో జోగుతున్నారు. పెట్రొ మాక్సు లైటు కృంగుతూ వెలుగుతోంది.

"ఎలా వున్నాడు మా అయ్య!" ఆందోళనగా అడిగింది దూరంనించే.

నంబూద్రి మేల్కొన్నాడు. "ఏమో....మాకేం తెల్సు" అతడికి డ్రయివర్ యింకా రాకపోవడం చిరాగ్గా వుంది.

"ఏం మనుషులో...." పుష్ప అసహ్యపడింది. పరుగుమీద ముత్యాలున్న గదిలోకి వెళ్ళింది.

దీపం ఆరి వుంది.

"అయ్యా...." ఏడుస్తూ పిలిచింది.

సమాధానం రాలేదు.

హాల్లో లైటు తెచ్చింది. ముత్యాలు అచేతనంగా పడివున్నాడు. "ఎలా వుందయ్యా!" తట్టి పిలిచింది.

చక్రం తిరిగి తిరిగి రావల్సిన చోటుకి వచ్చి చేరుకుంది. అది యింక తిరగవల్సిన పనిలేదు. జీవన భాండం నిండింది.

ముత్యాలు జీవితం ముగిసింది.

పుష్ప గొల్లుమంది.

అది రామినీడు, నంబూద్రి నిద్ర చెడగొట్టింది. లేచి ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు వానలో పుష్ప ఏడ్పు.

"వాడు చచ్చాడు కాబోలు" రామినీడు అన్నాడు.

"అలాగే వుంది వరుస."

"మనకిడేం పీడ. ఆ లారీలో మనం పోయినా బాగుండేది. ఛీ....ఇక్కడ దుర్భరంగా వుంది. ఈ డ్రయివర్‌గాడు ఎప్పు డొస్తాడో."

"ఈ వాన గురించే వాడు రావడం ఆలస్యమై వుంటుంది."

కాస్సేపుండి రామినీడు పుష్ప దగ్గరకెళ్లాడు. పుష్ప శవంమీద పడి ఏడుస్తోంది.

"వూర్కో అమ్మాయ్! ఏడిస్తే వస్తాడా?"

"రోజులు తీరిపోయాయి."

"సుఖపడ్డాడు. అందుకే భవబంధాలు త్రెంచుకున్నాడు."

రామినీడు ఓదార్పు ఆమెమీద పనిచెయ్యలేదు. ఏడ్పు తగ్గించ లేక పోయింది. అండగా వుండే తండ్రి యిక లేడు. వంటరిదయి పోయింది. ఎవరున్నారు తనకి? ఆ బాధ మరింత దుఃఖాన్నిస్తోంది.

"అలాగయితే యెలా చెప్పు? చెబితే వినాలి!" రామినీడు ఆమెను ప్రక్కకి లాగేడు.

పుష్పలో చలనం కలిగింది అంత దుఃఖంలోనూ. రామినీడుని ఆ చిరు చీకట్లో తొంగిచూపింది. అతడి ఓదార్పు అంచున కొంచెం దుర్మార్గంకూడ కనిపించింది. అతడి చేతులు నడుంచుట్టూ వున్నాయి.

పుష్ప విదిలించింది ఏడుస్తూనే.

రామినీడు వదిలి కర్రపెట్టెమీద కూర్చున్నాడు. వాతావరణం బీభత్సంగా వున్నా, యిక్కడ నాగరికమైన సదుపాయాలు లేకపోయినా పుష్ప వుంది. ఒంటరిగా వుంది. దిక్కు లేకుండా వుంది. మనుషులని పడగొట్టి వాళ్ళమీద నుంచి పరుగెత్తి తను శిఖరం యెలా చేరుకోవాలో అతడికి రాజకీయాలు నేర్పినయ్

ఆ పాఠం యిక్కడ గుర్తు వచ్చింది. దాన్ని వుపయోగించుకోవడానికి అతడికేం సిగ్గులేదు. ప్రజలు బహిరంగ సభల్లో తిట్టినపుడే అతడు నవ్వేశాడు. ఇప్పుడా?

"నీకెవరయినా చుట్టాలు వున్నారా?"

"దగ్గరిలో ఓరూ లేరు."

"ఒక్కదానివేనన్న మాట. "రామినీడుకి లైన్ క్లియర్‌గా కనిపించింది.

కాని పుష్పకి బాధ కల్గింది. తను ఒంటరిదయితే వీళ్ళేదయినా చేస్తారేమో....భయపడింది.

దుఃఖంతో పొంగిపోయిన ముఖాన్ని తుడుచుకుంటూ "మా బావయ్య వున్నాడు. ఈడకి వచ్చేస్తానని వుత్రుం రాసినాడు అయిద్రాబాదునుంచి" అంది.

"బావయ్య అంటే మీ అక్క మొగుడా?"

కాదన్నట్లు తలూపింది.

"మరి"

ఎలా చెప్పాలో తెలీయలేదు పుష్పకి. "మాకింకా మనువు కాలేదు. అయ్య బతికుంటే ఈ యేడు అయిపోయ్యూది."

"వాడు యెప్పుడొస్తాడో తెలియదాయె! అప్పటిదాకా శవాన్ని వుంచుతావా? చుట్టుప్రక్కల జనంకూడ లేరాయె! మనిషి చస్తే బరువే కదా! ముందర ఈ కార్యక్రమం జరిగాక తక్కినవి" తక్షణం జరగవల్సినవి చెప్పాడు.

పుష్పకి అది నిజమేననిపించింది. వానా గాలీ ఇలా వున్నాయి. ట్రాఫిక్ బందయిపోనాది. తండ్రిని బుగ్గిచెయ్యడం ఎలా? ఇంట్లో

రూపాయలుకూడ లేవు.

ఇన్నాళ్ళు ఆకుచాటు పిందెలా వుండేది పుష్ప, ఈ రోజు బయటపడింది. బాధ్యత మీదపడింది. బ్రతకడం యెంత బాధో తెల్సింది.

ఆడకూతుర్ని నాకేటి తెలుస్తది బాప్. దిక్కులేనిదాన్ని. మీరే వుపకారం సేయండి. మీ మేలు మర్చిపోను." అంది గద్గద కంఠా.

తనకి వరాలిచ్చే శక్తి వుంది. పదవివల్ల భక్తులు తనని చుట్టి ఔడతారు. ఆ వరాలు అందరికీ అందవు. ఖరీదైన భక్తులు మాత్రమే పొందుతారు. అలగా వాళ్లు కేవలం భజన చెయ్యడానికే.

"నిన్ను చూస్తే జాలి కలుగుతోందే పిల్లా. మావాడు రాత్రి నుంచి వెళ్ళిపోదామంటున్నా నువ్వెక్కడ బాధపడిపోతావోనని ఆపాను. ఇంకేం భయపడకు. మీ నాన్నని మంచి గంధం చెక్కలతో తగలేయిస్తాను. అన్ని పేపర్లలోనూ ఫొటో వేయిస్తాను."

"ఎంత మంచివాడో బాబు" అనుకుంది పుష్ప.

"నువ్వు ఒక్కదానివీ యిక్కడ ఎందుకు. రేపు నాతో వచ్చెయ్. రామినీడు మరింత ముందుకు వచ్చాడు పథకంలో.

"ఎక్కడికయ్యా."

"హైద్రాబాద్. నీలాంటి అప్సరస యిక్కడ వుంటే యేం లాభం? సినిమాల్లో జేరిపిస్తాను. లక్షలకొద్దీ డబ్బు, మేడలు, చీరలు, కార్లు...నీకు మహారాజజాతకం పడుతుందనుకో. ఆ పూచీ నాది"హామీ యిచ్చాడు.

ఇవన్నీ తనకేనా? పుష్ప ముందర సంతోషపడింది. కాని నమ్మకం చాలలేదు. ఈ పల్లెలో, కుటుంబంలో తండ్రి రక్షణలో యిన్నాళ్ళు వుంటూ వచ్చింది. అనామకులతో ప్రపంచంలోకి పోడానికి ఆమె భయపడింది.

"మా బావయ్య రానీయండి. ఆడూ నేనూ వస్తాం. అప్పుడు సూడొచ్చు."

"వాడుకూడ యెందుకు? అప్పటిదాకా మేం ఆగుతామా?"

"ఆడు లేందే రాను నేను" స్పష్టంగా చెప్పింది.

రామినీడు నిరుత్సాహంగా చూశాడు. ఈ బుసకొట్టే శరీరంలోని వంపుల్ని, సొంపుల్ని యెంతో తొందరగా అనుభవించాలని వుంది. అందుకే అరచేతిలోని వైకుంఠం చూపించాడు. పిట్ట పడాలి కాని తర్వాత ఏదయిన చేయవచ్చును. తన సరదా తీరాక బొంబాయివాళ్ళకి ఫడేస్తే పాతికవేలు పోస్తారు.

"పుష్పా! నేను చెప్పినట్లు విను. వాడికోసం నీ భవిష్యత్తు చెడగొట్టుకోకు. అయినా వాడెక్కడికి పోతాడు? నీ పేరు ప్రఖ్యాతులు విని వాడే నీ దగ్గరికి వస్తాడు. కొంచెం ధైర్యం తెచ్చుకో" రామినీడు ఆమె దగ్గరగా జరిగి నచ్చచెప్పాడు.

తియ్యగా కనిపిస్తున్నా పుష్ప విశ్వసించలేకపోయింది. తను ఘోరమైన బాధలో వుండగానే తొడ నొక్కినవాడు, వుత్తప్పుడు వూరుకుంటాడా?

"బావయ్య రానీండి" పాత పాటే పాడింది.

వెర్రిచేప కాదు. ఎరని ఎరగానే చూస్తోంది, ఆహారంగా చూడటం లేదు.

రామినీడుకి విసుగు వచ్చింది. "నీ ఖర్మ. మట్టి పిసుక్కునే రాత నీ మొఖాన వుందేమో!" అని అక్కడ్నుంచి లేచిపోయాడు.

పుష్ప ప్రాన్పడిపోయింది.

## 6

పరుపులమీద, ఆడగాలి వీస్తూండగా నిద్రపోయే నంబూద్రికి ఆ రోజు శివరాత్రయింది. అక్కడికీ నిద్రకి ఆగలేక కాఫీ హోటలు బెంచీలమీద పవళించినా రెప్ప మూసుకోవడంలేదు. చలి. దుప్పటి లేదు. బల్ల కఠినంగా వుంది. బయటనుంచి, పైనుంచి అప్పుడప్పుడు వానజల్లు పలకరిస్తోంది. హోటలు పొయ్యి దగ్గర్నుంచి నీచువాసన గుప్పుమంటోంది. వీటికి సాయం పురుగులు చుట్టూరా ప్రదక్షిణం చేస్తున్నాడు. ఈ పరిస్థితిలో నిద్రపోలేక లేచి కూర్చున్నాడు.

డ్రయివర్ యింకా రాలేదేం? ఎంతసేపు యిక్కడ జాగరణ?

బయట కుండపోతగా కురుస్తున్న వానకి డ్రయివర్ వస్తాడని

ఆశపడలేకపోయాడు. పెళ్ళికి బయలుదేరినందుకు వెయ్యిన్నొకటోసారి చింతించాడు.

"సిగరెట్ వుందా?" రామినీడు వచ్చి ప్రక్కన కూర్చున్నాడు.

నంబూద్రి పెట్టె తీశాడు. మూడే వున్నాయి. ఒకటి యిస్తూ "మనం పొదుపు నేర్చుకోవాలి. విముక్తి యెప్పుడో తెలియదుకదా!" నవ్వాడు.

రామినీడు రెండుమూడు అగ్గిపుల్లలుగీసి నా సిగరెట్ అంటుకో లేదు. గాలికి ఆరిపోయింది. లేచివెళ్ళి లాంతరు దగ్గర అంటించుకుని వచ్చాడు.

"ఏమిటా పిల్లతో పథకం వేస్తున్నావు. కాయా? పండా?" నంబూద్రి అడిగాడు.

చెప్పడానికి రామినీడు సిగ్గుపడలేదు. ఎందుకంటే నంబూద్రి తన స్థాయి మనిషి. ఇద్దరూ తోడు దొంగల్లాంటివారు. ఒకరి రహస్యాలు, బలహీనతలు మరొకరికి తెల్సు. సాయంచేసుకుంటారు. ఇచ్చిపుచ్చుకునే స్నేహాలు యెప్పుడూ వృద్ధిచెందుతాయి.

"తెలివైనది" అసంతృప్తిని నెమ్మదిగా చెబుతూ.

"రాజకీయం పనికి రాలేదా?"

"మనకే పాఠం చెప్పేలా వుంది."

"అలాగా!"

లక్ష మాటలకంటె లక్షణంగా నాలుగు బిస్కట్లు పడేస్తే కుక్కతోక ఆడిస్తూ వచ్చేస్తుంది."

డబ్బు ఏ రకమైన పనయినా చేస్తుందని నంబూద్రి విశ్వాసం. అతడు డబ్బు పండిస్తున్నాడు, రకరకాల దారులద్వారా. అధికారం కాని, సుఖాలుకాని, దైవంకాని డబ్బుని దాటిపోలేవని ధీమా.

"ఇది కుక్కకాదు, సింహం."

"ఏమిటంత గొప్పగా చెబుతున్నావ్.... నువ్వే?"

"నిజం నంబూద్రీ....నావల్లకాలేదు. నువ్వు ప్రయత్నించు."

తను రంగంలోకి దిగుదామనుకున్నాడు నంబూద్రి. కాని ఈ దశలో రామినీడు ప్రయత్నించాకా ఆమె తనని నమ్ముతుందా? రామి

సీను తొందరపడి పాడుచేశాడు. ఇప్పుడేం చెయ్యాలి?

"ఏం మాట్లాడవేం? "రామినీడు తట్టి హెచ్చరించాడు.

"చూద్దాంలే.... కాస్సేపు ఒరుగు. కళ్ళు మండుతున్నాయి."

ఇద్దరూ బెంచీలపై దగ్గరగా పడుకున్నారు. నిద్ర పట్టడం లేదు. పుష్ప కనిపిస్తోంది మత్తుగా.

పుష్ప ఏడ్వలేక అలసటగా జేర్లబడి కునికిపాట్లు పడుతోంది.

తెల్లవారింది.

వానజోరు తగ్గింది. ఎండ వచ్చింది కూడ. నంబూద్రి రామినీడు లేని కూర్చున్నాడు. కాఫీ టైం అయింది. వచ్చేమార్గం లేదు. తలనొప్పితో పిచ్చిఎక్కేలా వుంది. సిగరెట్లు కూడ పూర్తిగా పీకలు కూడ లేకుండా కాల్చివేశారు.

నంబూద్రి దేరా కట్టిన గోనెపట్టా తప్పించాడు. బయటికి వచ్చాడు. ఎటు చూసినా నీరు. వానకి తడిసిన చెట్లు గాలికి జల్లులు కురిపిస్తున్నాయి.

అంటించని ఆటంబాంబులా పడివున్నారు ఇద్దరూ.

పదకొండు గంటలయింది. రోడ్డుమీద నీరు తీసింది. ఓ లారీ వచ్చింది కూడ. దాని చప్పుడు విని నంబూద్రి ఆపమని కేకలు వేశారు. లారీ నిండా జనమే. అది ఆగలేదు.

మరోగంటకి మోటారుసైకిల్ వచ్చింది.

అది తమ డ్రయివర్‌ది.

నంబ్రూది రామినీడుకి అతడు భగవంతుడిలా కనిపించాడు. చప్పట్లు కొట్టారు.

"రాత్రంతా ఎంత ప్రయత్నించినా రాలేకపోయాను సార్. వానకి ఎవరూ రామన్నారు. ప్రొద్దుటే ముకుందంగారి యింటికి వెళితే మోటర్‌సైకిల్ యిచ్చి మిమ్మల్ని తీసుకురమ్మన్నారు" అన్నాడు డ్రయివర్.

అది మోపెడ్ బండి. ముగ్గురు ఎక్కడానికి వీల్లేదు.

నువ్వెళ్ళు నువ్వెళ్ళు అని యిద్దరూ బలవంత పెట్టు కున్నారు. లోలోపల ఎవరికి వారికే ముందర బయటపడాలని వున్నా

మర్యాద ఒలకబోసుకున్నారు.

"నువ్వెళ్ళు. అరగంటలో నేనూ వస్తాను కదా! నీ కసలే వంట్లో బాగోలేదు" నంబూద్రి స్థిరంగా చెప్పాడు.

"తొందరగా వలెయ్?"

మోపెడ్ ముందుకురికింది. నంబూద్రి కాసేపు అక్కడే నిలబడి యింట్లోకి నడిచాడు. ఎదురుగా పుష్ప.

నంబూద్రి బుద్ధి పనిచేసింది.

"ఏం భయపడకు పుష్పా అన్నీ నేను చూస్తాను" హామీ యిచ్చాడు.

ఏమనాలో తెలీక తలూపింది.

రైలుగేటు చంద్రయ్య టీ త్రాగడానికి కాస్సేపటి అక్కడికి వచ్చాడు. హోటల్ కళ తప్పివుంది.

"బాబాయ్" అంటూ ఘొల్లుమంది పుష్ప.

జరిగిన ఘోరం విని చంద్రయ్య విచారించాడు. ధైర్యం చెప్పాడు. అలా యిదయిపోతావెందుకే పిచ్చి పిల్లా? మేం లేమా?"

నంబూద్రి చంద్రయ్యని బయటికి పిలిచాడు. రెండువందలు చేతిలోపెట్టి "ముత్యాలు అంత్యక్రియలకి ఏర్పాటు వెంటనే చెయ్యి. ఇంకా శవం యిక్కడ వుండటం మంచిది కాదు. పుష్ప రాత్రినుంచి ఏడుస్తూనే వుంది" అని చెప్పాడు.

అలాగే బాబూ....ఓ అరగంటలో అన్నీ సిద్ధం చేయిస్తాను" చంద్రయ్య హడావిడిగా పరిగెత్తాడు.

"మా గురించి శ్రమ తీసుకుంటారా బాబూ."

"ఆపదలో సాయం చేసుకోవద్దూ."

ఆ బాబుకీ ఈయనకి యెంత తేడా అనుకుంది పుష్ప.

"మరి ఒక్కదానివే వుండగలవా?"

ఉంటాను అనలేకపోయింది. ఉండలేను అనలేకపోయింది. రెండూ భయంగా తోచాయి.

"బంధువులుంటే చెప్పు. అక్కడికి పంపిస్తాను."

"బావమ్మే బందువు."

"అతడు రావాలంటే వ్యవధిపడుతుంది కదా! వానకి బస్సులు రైళ్ళు ఎక్కడివక్కడ ఆగిపోయివుంటాయి."

పుష్ప తనగురించి నిర్ణయం తీసుకునే స్థితిలోలేదు. సంబూద్రి తొందరపడి తన నిర్ణయం ఏమీ చెప్పలేదు. చెప్పాక అది పుష్పకి ఆమోదంగా లేకపోతే తను వెలితి పడాలి!

చంద్రయ్య, మరికొంత మంది వచ్చారు. ముత్యాలు శవం కదిలింది. చివరిసారిగా పుష్ప అందుకుంది శోకం. చంద్రయ్య పెళ్లాం పట్టుకుంది ఆమెని. "ఇంకా ఏడుపెందుకే పిల్లా....ఆడికి నూకలు సెల్లినాయి. సుకపడ్డాడు జెంజాటం లేకుండా."

డ్రయివరు తిరిగి వచ్చేసరికి రెండయింది. రామినీడుని దింపాక తిరిగి వస్తూండగా పంచరు అయింది. తిరిగి వెనక్కిపోయి ముకుందం కారు తీసుకుని క్యారేజీలో భోజనం, కాఫీ తీసుకువచ్చాడు ఆలస్యమవుతోందని.

"మంచిపని చేశావు. సిగరెట్లు తెచ్చావా?" కాఫీ తాగిన వెంటనే నంబూద్రికి వుషారు వచ్చింది.

కొత్త ప్యాకెట్ అందిచ్చి "మెకానిక్ వచ్చాడండి. మన బండి బాగుచేయిస్తాను మీ భోజనం అయ్యేలోగా" అన్నాడు డ్రైవర్.

"అలా చెయ్యి."

నంబూద్రి స్నానంచేసి బట్టలు మార్చుకున్నాడు. తిరిగి అతనిలో చైతన్యం వచ్చింది.

"రా పుష్పా....భోంచేద్దాం?" క్యారేజీ విప్పుతూ పిలిచాడు.

"నాకు వద్దు బాబూ. ఆకలి లేదు."

"తింటే అదే వేస్తుంది రా."

"పుష్పకి తినాలని లేదు. నంబూద్రి బలవంతంమీద ఎంగిలి పడి లేచింది.

నాల్గింటికి కారు రిపేరు పూర్తయింది.

"వస్తా పుష్పా....వచ్చేటప్పుడు చూసి వెళతాలే. మీ బావయ్య రాకపోతే ఏదైనా చేద్దాం" రెండువందలు ఆమెముందు పెట్టి

బయలుదేరాడు.

"దయుంచండి" పుష్ప చేతులు జోడించింది.



ఆ రాత్రి పుష్పని తమ యింటికి రమ్మన్నాడు చంద్రయ్య. అక్కడికి పదిబారల్లో వుంది అతడి యిల్లు. ఒంటరిగా వుండడానికి భయమయినా తను అక్కడికి పోతే యెలా? ఇంటికి తలుపూ ద్వారం లేదు. ఉన్న వస్తువులను యెవరయినా చక్కబరిస్తే....? అదే చెప్పింది చంద్రయ్యతో.

"రైటే....మీ పిన్నమ్మని పంపుతాలే" అన్నాడు చంద్రయ్య,

గిన్నెలో అన్నం పెట్టుకుని రాత్రి ఎనిమిదింటికి చంద్రయ్య పెళ్ళాం వచ్చింది. రెండుముద్దలు ఆమె బలవంతంమీదే తింది పుష్ప.

వానలేదు. గుడ్డివెన్నెల కాస్తోంది. వానాకాలం వెన్నెల మట్టి మీద పాలు వొలికినట్లుంది.

పుష్పని తండ్రిజ్ఞాపకాలు వదలడంలేదు. ఆమెని మరిపించ డానికి చంద్రయ్య పెళ్ళాం తన బర్మా అనుభవాలు చెప్పసాగింది.

రేపయినా బావయ్య రాకూడదూ....పుష్పలోని ఆశ పీకు తున్నది.

వెలుగురావడంతోనే చంద్రయ్య పెళ్ళాం లేచింది. "చంటి దానిచేత కాఫీ పంపిత్తా....ఈటకే ఆలీసమయిపోయింది" అంది హడావిడిగా వెళుతూ. ఆమె చుట్టుప్రక్కల పల్లెల్లో వుదయం పాలూ పెరుగు అమ్ముతుంది.

పుష్ప కాఫీ త్రాగాక, ఇంటిచుట్టు వానకి పడిన చెట్లని కత్తితో కొట్టివేయసాగింది.

ఎండ బాగానే వచ్చింది. తిరిగి ట్రాఫిక్ ప్రారంభమైంది. అక్కడక్కడ పల్లాలలో మాత్రమే నీళ్ళున్నాయి.

మామూలుగా లారీవాళ్ళు, బస్సుజనం రాసాగారు. పుష్ప హోటల్ మూసిన కారణం చెప్పింది. తెలిసినవాళ్ళు సానుభూతి చూపించారు.

పదిగంటలయింది. పనికి పుష్ప అలిసిపోయింది. అయినా

నెమ్మదిగా చెయ్యసాగింది.

చంద్రయ్య పొగాకుపాయ విడదీస్తూ "నీ కెందుకమ్మా" అంటూ వచ్చాడు.

"అడ్డంగా వున్నాయి బాబాయ్."

చుట్ట వెలిగించి చంద్రయ్య పనిలో సాయంపడుతూ "పొద్దుట నుంచి సూస్తున్నా. ఓ టేలు తిరిగి నడపకూడదా. ట్రాఫిక్ వాళ్ళు యిదయిపోతున్నారు ఏం దొరక్క" అన్నాడు.

"నా వల్ల ఏటవుతాది."

"డూటీ లేనపుడు నేనుంటాలే."

"బావయ్య రానీ....నాకు అన్నీ తెలీవు."

"ఆడు యింకా రాలేదేమే....మళ్ళీ లెట్రు రాసినాడా?"

"లేదు. రాడం మానీశాడంటావా?"

"అబ్బే. అలాంటిదవదు. వస్తానన్నాక ధృవుడు మానీయడు."

"ఆడికోసం యిదిగా సూ త్తన్నా."

మధ్యాహ్నం పుష్ప చంద్రయ్య యింటిదగ్గర భోజనంచేసి తిరిగి వస్తూంది. వంతెన దగ్గర్నుంచే తన యింటిడేరా తలుపు తీసి వుండటం చూసి గతుక్కుమంది. ఏ దొంగయినా దూరాడా? పరుగున వచ్చిపడింది.

బల్లమీద నీలం పాంటు, వచ్చగళ్ళ చొక్కాతో ఓ యువకుడు ఎయిర్ బాగ్ మీద తల ఆన్చి విశ్రాంతిగా బేడీ కాలుస్తూ కూర్చున్నాడు.

"బావయ్యా."

ధృవుడు తల ఎత్తాడు. "ఏడకి పోయారే నువ్వూ మీ అయ్యా. పిలిచి పిలిచి నా నోరు నొప్పెట్టింది."

"ఇంకెక్కడి అయ్య." వెక్కిళ్ళు పెట్టింది.

ధృవుడు నెమ్మదిగా తేరుకుని ఆమె చెక్కిళ్ళు తుడిచాడు ఆమె చీర కొంగుతో, "వూర్కో....మన బతుకులు మనం సూసుకోవాలి గదా!"

పుష్ప లేస్తూ "వన్నం వండుతానాగు" అంది.

"నా భోజనం హోటల్లో అయిపోయింది."

పుష్ప జరిగిన సంగతులన్నీ నెమ్మదిగా చెప్పసాగింది. ధృవుడు రావడంతో ఆమెకి ధైర్యం వచ్చింది.

ఇక్కడికి ధృవుడు తన జీవితం మలుపు తిప్పుకోవడానికి వచ్చాడు. సీను డబ్బుతో పరారవడం, మామ పోవడం అపశకునాలుగా కనిపించాయి. అక్కడ వదులుకుని వచ్చాడు. ఇక్కడ దారి లేదు. తన అభివృద్ధి ఆగిపోయిందని తెలియగానే ధృవుడికి మనస్సు పాడయింది.

"నమ్మకంగా వుండేవాడు. ఆడికేం దుర్బుద్ధి రేగిందో. కొంపముంచాడు. ఆడీపని సెయ్యకుంటే అయ్య పోయేవాడా?"

ధృవుడు మరేం మాట్లాడలేదు. బెంచీమీద విశాలంగా పడుకుని కళ్ళు మూసుకున్నాడు. పరుగెత్తుకు వచ్చాడు జోర్లాపడ్డాడు.

పగిలిన కుండలో గాలి కస్సుమన్నట్లు వేడినిట్టూర్పు వెలువడింది నోటినుంచి.

అలాగే నిద్రపోయాడు. సాయంత్రం చంద్రయ్య పుష్ప మాట్లాడుకుంటూండగా మెలకువ వచ్చింది.

పుష్ప టీ తెచ్చియిచ్చింది.

చంద్రయ్య తిరిగి జరిగినవన్నీ చెప్పసాగేడు. పరిస్థితికి ధృవుడికి భయంగానే వుంది. అది బ్రతుకు భయం. కాని దాన్ని తెలియనీయలేదు. పుష్ప మరింత భయపడి ఏడుస్తుందని.

"ఒటేలు తెరవండ్రా రేపటి నుంచి. ఆడు పోయాడు. మనకి తప్పవుగా తిప్పలు. ఏడుస్తే రోజులు ఎలతాయా?" చంద్రయ్య సలహా యిచ్చాడు.

"హోటలు పని నాకు అలవాటు లేదాయె" ధృవుడు కాస్త ఆలోచించి అన్నాడు.

"అదేం బెమ్మిద్యా....పుష్ప చెప్తాది. నేనుంటినిగా...."

"సరేలే" అన్నాడు ధృవుడు.

ఇది కొత్తదారి. తను కోరుకోనిది. అయినా పోకతప్పదు. పరిస్థితి వ్యతిరేకంగా వున్నపుడు సర్దుబాట్లు తప్పవు."

మర్నాడు హోటల్ తెరిచారు.

ఫలహారాలు చెయ్యడం పుష్పకి వచ్చు. టీ, కాఫీ తయారు చెయ్యడమే ధృవుడి పని. చంద్రయ్య చిన్నకొడుకుని సాయంగా పెట్టుకున్నారు.

ప్రయాణీకులు గోల పెట్టేశారు ధృవుడి కాఫీ టీలు త్రాగలేక. ఒకదానిలో పంచదార ఎక్కువ వేసేవాడు. మరోదాన్నిలో పొడుం వుండేది కాదు. ఒక్కసారి పదిమంది వచ్చిపడితే మరింత కంగారుగా వుండేది. ఆ హడావుడిలో ఏదో వస్తువు పొడయ్యేది. ధృవుడు ఆ గొడవలో వుండగా కొంతమంది డబ్బులు ఈయకుండా జారుకునే వారు. ఈ సరిపడని పనికి ధృవుడికి పిచ్చి ఎక్కిపోయేటట్లు వుండేది.

ఆ రోజు మధ్యాహ్నం వేడిపాలగిన్నె చేతిమీదకి వలికి పోయింది టీ చెయ్యబోతుండగా.

"బాగుంది వరస. నువ్వుచేశావ్. మేం తాగాం!" ఈసడిస్తూ వెళ్ళిపోయారు లారీ క్లీనర్లు.

ధృవుడు బాధగా చెయ్యి చన్నీళ్ళలో పెట్టి కూర్చున్నాడు. పుష్ప కొబ్బరినూనె సీసా తెచ్చింది. అతడి చేయితీసి నూనె రాస్తోంది.

"దానికే బిక్కముకం పెట్టాలా?" నవ్వుతూ అడిగింది

"నీ గూర్చి వున్నాగాని, ఈ సెండాలంపని నావల్లకాదు."

"ఏం చెయ్యగలవు?" చుట్టూచూసి కవ్వింపుగా అడిగింది. ఎవరూలేరు. మర్రిచెట్టు క్రింద రెండు మేకలు అరుస్తున్నాయి.

"ఇన్ను తినీగల్ను."

పుష్పని మీదకి తీసుకున్నాడు.

"ఏటది....ఓరయినా సూత్తారు."

"సూసి కళ్ళు మూసుకుంటారు పాపమని.

"పాపం....పెద్ద తెలివే" పుష్ప విడిపించుకుంది.

రోజులు గడుస్తున్నాయి. ధృవుడు నెమ్మదిగా పనికి అలవాటు పడుతున్నాడు. పరిస్థితి సర్దుకునేవేళ అవాంతరం వచ్చిపడింది.

ఆ ప్రక్కస్థలం ఇరవై ఎకరాలూ ఒక మార్వాడీ ఫ్యాక్టరీ కట్టడానికి కొనేశాడు. ధృవుడిని ఖాళీ చెయ్యమన్నాడు.

ధృవుడు ఏం చెయ్యాలో నిశ్చయించుకునేలోపుగా మార్వాడీ

గుమస్తా తిరిగివచ్చాడు. "ఏరా? యింకా ముహూర్తం దొరకలేదా? నీ బాబు స్థలమనుకున్నావా ఇల్లు వేసెయ్యడానికి. రేపిపాటికి షెడ్డు విప్పేయాలి. లేకపోతే మా వాళ్ళే ఆ పని చేసేస్తారు. ఖర్చులు యిచ్చుకోవలసి వస్తుంది. సామాన్లేం పనికిరాకుండా పోతాయి."

ధృవుడు ఎంత బ్రతిమాలినా వుపయోగం లేకపోయింది.

## 8

"అయిదరాబాదు పోదాం బావయ్యా....అడ నవ్వక్రీ సేసావు గందా. తిరిగి ఏడయినా పెయిత్నిస్తే దొరక్కపోతుండేటి" పుష్ప సలహా యిచ్చింది.

"అదే దారి మరి!" ధృవుడు అంగీకరించాడు.

షెడ్డు విప్పేశారు. పనికివచ్చే సామాను అంతా అమ్మేశారు. ఆరువేలు వచ్చింది. మిగతా సామాను చంద్రయ్యకిచ్చిపేశారు. బట్టల సూట్ కేస్‌తో బయలుదేరారు.

చంద్రయ్య గేటుదాకా కూడా వచ్చాడు. "ఎల్లాక వుత్తరం రాయండమ్మా....లేకుంటే నాకు తోచదు."

"అలాగే బాబాయ్" భారంగా అంది.

ధృవుడు వస్తున్న లారీని ఆపాడు. అది హైద్రాబాద్ పోయేదే. లోడు పూర్తిగా లేదు. వెనక ఎక్కమన్నాడు డ్రయివర్.

పుష్పని ముందర ఎక్కించి తర్వాత ధృవుడు ఎక్కాడు. చంద్రయ్య చెయ్యివూపి "జాగ్రత్త బాబూ" అన్నాడు. ధృవుడు తలూపాడు.

లారీ బయలుదేరింది.

ఇన్నాళ్ళు పెరిగిన, మసలిన పరిసరాలు దూరమవుతూంటే పుష్పకి బాధ కల్గుతోంది. ఎన్నో దృశ్యాలు అలలుగా లేచిపోతున్నాయి. అవన్నీ యిక నిన్నటివి. తిరిగిరావు.

ఏదో ఆశావహంగా కనిపిపిస్తోంది ఆమెకి. ఈ కొత్త మజిలీ ఆనందదాయకంగానే వుండగలదనిపిస్తోంది.

ధృవుడు బస్తాలని సర్ది దుప్పటి పరచి పడుకున్నాడు. పుష్ప తనని ఆనుకుని కూర్చుంది. ఇద్దరికీ మాట్లాడుకోవాలనిలేదు. రేప్పు

మీద వుంది మనసంతా.

నెమ్మదిగా నిద్ర వ్యాపించింది.

ముందర ధృవుడికి ఆ కేకలకి మెలకువ వచ్చింది. ఎవరో కర్రతో పొడుస్తున్నారు. కళ్ళు నులుముకుంటూ చూశాడు. ఇంకా చీకటిగానే వుంది చుట్టూరా అడవిప్రాంతం. లారీ ఆగివుంది.

"ఏం?" ధృవుడు అడిగాడు క్రిందకి చూసి.

"దాన్నికూడ లేపు. దిగండి" లావుపాటివాడు అరిచాడు. వాడుకాక యింకా నలుగురున్నారు.

ధృవుడు, పుష్ప సూట్‌కేస్‌తో దిగారు. లారీ చెడిపోయిం దేమోనని అనుకున్నారు.

ఒకడు సూట్‌కేస్ లాగేశాడు.

"ఏంటది...." ధృవుడు కంగారుగా అడిగాడు. అందులో మొత్తం డబ్బు, బట్టలు వున్నాయి.

"నోర్మూయ్?" మరొకడు చెంపకాయవేసి "నీ వాపి. జేబులో ఏముందో తొందరగా బయటపెట్టు. ఆలీసం సేస్తే అప్పుడం కింద నంజేస్తాను" అన్నాడు కోపంగా.

పుష్ప జరుగుతున్నదేమిటో గ్రహించివేసింది. ఆ లారీవాళ్ళు దారిమధ్యలో దోపిడీదొంగలయ్యారు. వాళ్ళందర్నీ ధృవుడు ఎలా ఎదుర్కొనగలడు? బ్రతిమాలినా వుపయోగముండదు. వాళ్ళు రాక్షసి ముండాకొడుకులు. ఆలస్యంచేస్తే తనమీద కూడ పడతారు. ముందర తను తప్పించుకోవాలి.

ధృవుడు తిరగబడ్డాడు.

అందులో వున్నది వాళ్ళ కష్టార్జితం. రేపుకోసం తమ జీవితాన్ని నిర్మించుకోడానికి నిల్వచేసుకున్న సొమ్ము పోగొట్టుకోగలరా అంత సులభంగా! అందుకే బలహీనుడయినా వాళ్ళమీదకి వురికాడు.

ఇదే సమయమనుకుని పుష్ప రోడ్డుక్రింద తోటల్లోకి పరుగు తీసింది.

"అది పారిపోతోందిరా!" క్లీనర్ అరిచాడు.

ఇద్దరు పుష్పకోసం పరుగెత్తారు.

తక్కినవాళ్ళు ధృవుడి నోర్మూయించారు. చిత్తగ్గాటి రోడ్డు ప్రక్కన పడేశారు.

కాస్సేపటికి పుష్పకోసం వెళ్ళినవాళ్లు వచ్చారు. "అది కని పించలేదు ఆలస్యమవుతుందని వచ్చేశాం."

డ్రయివర్ లారీ స్టార్టుచేసి "తొందరగా ఎక్కండి ఎవర యినా వస్తే ప్రమాదం. ఇప్పటికే లేటయింది' హడావుడి చేశాడు.

లారీ వెళ్ళిపోయింది.

కాస్సేపటికి ధృవుడు లేచాడు. వళ్ళంతా నొప్పులుగా వుంది. కుడిమోకాలు రక్తంతో తడిసివుంది. ముఖమంతా గీరుకుపోయి మంట పెడుతోంది.

జరిగినదంతా గుర్తుకు వచ్చింది. సర్వం సున్నా అయింది. ఆశపడడానికి ఏ మార్గమూ కనిపించలేదు.

మరి పుష్ప?

కంగారుపడి బలవంతంగా లేచాడు. కాని అడుగేయడం వశం కాలేదు. తూలిపడ్డాడు.

తనకేం తెలియనట్లు ప్రకృతి మూగనోము పట్టి కూర్చుంది. ఆకులు కదిలే చప్పుడే వినిపిస్తోంది.

"పు....ష్పా" ఎలుగెత్తి అరిచాడు.

ఒకసారి. రెండుసార్లు....పదిసార్లు.

....అలా పుష్ప ఎంతో దూరం పరుగెత్తలేక పోయింది. క్రింద ఎండుటాకులు. తన పరుగు చప్పుడవుతోంది. వెనకనుంచి ఎవరో రావడం చూసింది. తన పని ముగిసిందనుకుంది కాని నిస్స త్తువుగా వూరుకోలేక ఒక చెట్టు ఎక్కేసింది. గుబురులో దాక్కుంది వగర్పు అణచుకుంటూ?

వాళ్ళు అటు రానే వచ్చారు.

"ఏదిరా....తూనీగలాజారిపోయింది" అన్నాడు ఒకడు.

"ఈ ప్రాంతంలోనే వుంటుంది....వెతకండి" అన్నాడు మరొకడు.

పుష్ప వూపిరి బిగబట్టి చూస్తోంది. వాళ్ళు అక్కడే కాస్సేపు

తిరిగి రోడ్డు ఎక్కారు. 'బ్రతుకుజీవుడా' అనుకుంది. లారీ వెళ్ళిన శబ్దం వినిపించినా భయంతో కదలలేకపోయింది.

ఆ కేక పదేపదే వినగా ధృవుడిదేనని పోల్చుకుంది. కంగారులో చెట్టు ఎక్కకలిగింది, కానీ దిగడానికి భయంవేసింది. చెట్టు ఎత్తుగా వుంది. భయంభయంగా ప్రాకి దిగింది. రోడ్డుమీదకి దారి తెలీలేదు. క్రింద రాళ్ళు, ముళ్లు కరుస్తున్నాయి.

ఎగువకి పోయాక రోడ్డు కనిపించింది. కాని అక్కడ ధృవుడు లేడు. 'బావయ్యా' అని పిలుస్తూ ముందుకు వచ్చింది.

ధృవుడు తూముమీద కూర్చున్నాడు. పుష్ప పరుగుమీద వచ్చి అతడిమీద వాలి, వాళ్ళ చేతులుపడ .... గట్టిగా కొట్టారా" అంది తడుముతూ.

చీరతో అతడిగాయం తుడిచింది.

డబ్బు సర్వం పోయినా తను దెబ్బలు తిన్నా ధృవుడికి తృప్తిగానే వుంది. పుష్పమీద అఘాయిత్యం జరగలేదు.

"పోలీసోళ్ళకి సెబుదామా?" పుష్ప అడిగింది.

"ఎందుకు....అదో కష్టం....మన డబ్బులు రావుకాని ఠేశన్ చుట్టూ తిరగాలి" అన్నాడు ధృవుడు.

ఓ గంటసేపు వాళ్లు అలాగే కూర్చుండిపోయారు జరిగింది తలుచుకుంటూ. ఎన్ని మాటలు చెప్పుకున్నా, ఓదార్పు తెలియజేసుకున్నా గుండెల్లో గుబులు పోలేదు. దగ్గర వంటిమీద బట్టలు తప్ప మరేం లేవు. రేపు ఎలా వెళుతుంది?

ముందర అక్కడ్నుంచి బయట పడడానికి నిశ్చయించుకున్నారు. పుష్ప వచ్చేపోయే లారీలను, కార్లను ఆపమని అరవసాగింది.

ఎవరూ నిలపలేదు. ఇలా అరగంట గడిచింది. పుష్ప ఆశగా ప్రయత్నిస్తూనే వుంది.

చివరకి ఒక ముసలాయన ఫియట్ ఆపాడు. "యెక్కడికి?"

ఎక్కడికి వెళ్ళాలో పుష్పకేం తెల్సు. తమపై జరిగిన దాడి చెప్పుకుంది ఏడుస్తూ.

"వెనక సీట్లో ఎక్కండి. రుద్రారం దాకా వద్దురుగాని."

ధృవుడ్ని కారుదాకా చేయి ఆసరా యిచ్చి ఎక్కించి తాను యెక్కింది. కారు బయలుదేరింది.

ఇలా లారీలు యెక్కడం యెంత ప్రమాదమో ముసలాయన కారులో వున్న తన భార్యతో చెబుతున్నాడు.

వెలుగు వచ్చేసరికి ఒక పల్లెటూరి మొగలో కారు ఆగింది. "ఓగండి" అన్నాడు ముసలాయన.

పుష్ప, ధృవుడు కారు దిగి యెదురుగా వున్న సత్రపు అరుగెక్కారు.

# 9

అది సత్రం అయినా తలుపులు తాళాలు యేం వుండవు. మధ్య విశాలమయిన హాలు చుట్టూ పసారాలు. బిచ్చగాళ్ళకి, సాధువులకి అది నిలయం.

ఎదురుగా పెద్దరావిచెట్టు వుంది. వచ్చేపోయే బస్సులు అక్కడే ఆగుతాయి. దాని కెదురుగా రెండు పాక హోటళ్ళు, కిళ్ళీబడ్డీలు, పళ్ళ దుకాణాలు వున్నాయి.

వూర్లోకి పోయే రోడ్డుకానుకుని చిన్న రామాలయం వుంది. అక్కడ పందిరివేసి వుంది. వుత్సవం జరగబోతోంది. స్పీకర్‌లో తెలుగు సినిమా పాటలు గట్టిగా వినిపిస్తున్నాయి.

ధృవుడు, పుష్ప సత్రం అరుగుమీద చాలసేపు అలా కూర్చునే వున్నారు. ఏం చెయ్యడానికి పాలుపోవడంలేదు. వాళ్ళిద్దరికి మాట్లాడుకోడానికి కూడా భయంగా వుంది. ధృవుడు గాయాల బాధ వల్ల ఎండ మీదపడుతున్నా, నిద్రపోయాడు,

పొద్దు ఎక్కింది. కొందరు బిచ్చగాళ్ళు సత్రం అరుగు క్రింద యిటుక పొయ్యిలుపెట్టి అన్నం వండుకుంటున్నారు కబుర్లు ఆడుకుంటూ. పుష్ప ఆశగా చూస్తోంది. ఆకలిరేగింది. ఓ ముసలిది పుష్పని అడిగింది. "ఏవూరు మంది? ఈడ కూకున్నావేం?"

పుష్ప చెబుతూంది. ఇంతలో ముసలిదాని మనవడు చేతిలో వుల్లిపాయలు, చిన్న సీసాతో నూనె తెచ్చి "రాయే....సోది తరవాత

యినొచ్చు "అని కేకలేశాడు. ముసిలిది వెళ్ళిపోయింది.

పుష్ప మరో గంట కూర్చుంది. ఆకలి విశ్వరూపం ధరించింది. ధృవుడు ఇంకా లేవలేదు. వాడు లేచినా వుపయోగమేమిటి?

పుష్ప బస్సు స్టాండు దగ్గరికి నడిచింది. రావిచెట్టు సెంటరు ప్రయాణికులతో రద్దీగా వుంది. రెండు గంటల్నుంచి బస్సులు లేవు.

అభిమానంగా వున్నా, అలవాటు లేకపోయినా ఆకలివల్ల పుష్ప నోరు తెరవక తప్పలేదు. తమ బాధ చెప్పుకుంది. సాయం చెయ్యమంది.

"దొంగముండలు ఇదో ఎత్తు" అందో బమ్మగారు.

"కష్టపడకుండా తినడం నేర్చారు" అన్నాడు ఓ వ్యాపారి.

"ఇది నాటకం నమ్మను" అన్నాడో కిరాయి నటుడు.

పుష్ప తల వాలిపోయింది. వుక్రోషం ముంచుకు వచ్చింది. కాని దరిద్రం నోరు తెరవనీయలేదు. అక్కడనుంచి వచ్చెయ్యబోతూండగా ఒక సూట్‌వాలా కేకవేశాడు. "నువ్వు చెప్పింది నమ్ముతాను" అన్నాడు.

పుష్ప సంతోషించింది. సూట్‌వాలాజనంనుంచి కొ_స్త ఎడంగా వచ్చి పది నోటు తీసి "మా ఇల్లు ప్రక్కనే. ఈ ఒకసారి రా" అన్నాడు.

"ఎందుకు బాబూ?"

ఆ మాత్రం తెలియదా అన్నట్లు చూశాడు. కొ_స్త దగ్గరగా వచ్చి నోటు ఆమె చేతిలో పెట్టి చెయ్యి నొక్కుతూ "పచ్చి జాంకాయలా వున్నావు" అన్నాడు కాంక్షగా చూసి.

పుష్పకి అర్థమైపోయింది. విదిలించుకుని నోటు క్రింద పడేసింది, 'సీ....నీ యెదప జనమ తగలడా' చీదరించుకుంటూ ముందుకు నడిచింది. సూట్‌వాలా కేకవేస్తున్నా ఆగలేదు. సత్రం దగ్గరికి వచ్చింది.

ధృవుడు లేవలేదు. లేపుదామా అనుకుంది. బాధ తెలియకుండా నిద్రపోతున్నాడు. లేస్తే బాధలేగా అని ఆమె లేపలేదు.

సత్రం అరుగు సాధువులతో నిండివుంది. సుష్టుగా భోం

చేపి గంజాయి పీలుస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. పుష్పని ఎగా దిగా చూశారు.

పుష్ప అక్కడ వుండలేకపోయింది. ముందర ఆకలికి జవాబు చెప్పాలి. వూళ్ళోకి నడిచింది. అంతా క్రొత్తగా వుంది. విశాలమైన వీధి. ఎడాపెడా పెంకుటిళ్లు. మేడలు.

చెరువు దగ్గరకొచ్చింది. అలసట ఎక్కువయింది. చెరువులో ముఖం కడుక్కుని కడుపునిండా నీళ్ళు త్రాగింది. తిరిగి వీధిలో సంచారం.

ఒకచోట పెళ్ళిపందిరి కనిపించింది. జనంతో నిండుగా వుంది. పుష్ప ఆశగా వెళ్లింది. కాని భయంగానే వుంది. అడిగితే పెడతారా?

పెరటి వైపుకి వెళ్లింది. వంట షెడ్డు దగ్గర్నుంచి సువాసనలు వస్తున్నాయి.

భోజనాలు అయ్యాయి అనుకుంది పుష్ప. ఆమెలో ఒకవిధమైన ధైర్యం తెగింపు వచ్చాయి. నేరుగా వంటషెడ్డులోకి వెళ్ళింది. వంటవాళ్లు తలో పనీ చేస్తున్నారు.

పెద్దయ్యగారు ఇద్దరికి భోజనం పెట్టీయమన్నారు" అంది ఒకడితో.

"యెన్నిసార్లు తిరగంమేము? యేదీ ఒక్కసారి చెప్పదు. బుట్టలో పెట్టి ఇస్తాం. పట్టుకెళ్లు" అన్నాడు అతడు విసుగ్గా.

ఆలాగేనంది పుష్ప.

తాటాకు బుట్టలో అన్నీ పెట్టి అందిచ్చాడు వంటమనిషి.

పుష్ప బుట్ట అందుకుని వస్తూండగా పెళ్ళివారి ఆసామీ యెదురై "యెవరి తాలూకు నువ్వు?" అనడిగాడు.

పుష్ప పై ప్రాణాలు పైనేపోయినాయి. అయినా కంగారు పడకుండా "సుబ్బయ్య రాలేక నన్ను పంపాడండి" అంది ఆయన మనుషుల్లో ఆ పేరువాడు వుండకపోతాడా అని.

అతడు పుష్ప సోయగానికి కట్టుబడిపోయి. "సాయంత్రం ఒకసారి కనపడు. మరచిపోక" అన్నాడు.

"అలాగేనండీ."

పుష్ప గండం గడిచినందుకు సంతోషించి, సత్రం దగ్గరకి వెళ్ళింది. ధృవుడు లేచి దిక్కులు చూస్తున్నాడు. "ఎడకి పోయేవే. కంగారుపడతన్నా."

యెదర జనం వుండటంతో పుష్ప సత్రం వెనకభాగానికి వెళ్ళింది. ధృవుడు కూడా వెళ్ళాడు. విశాలంగా వున్నచోట బుట్ట దించి భోజనం వడ్డించింది.

ధృవుడు పొంగిపోయాడు. ఆకలితీరే సంతోషంలో ఆమె చెప్పింది విని 'నీకూ బుర్రుంది' అన్నాడు చిన్న మొట్టికాయ వేసి.

ఆ రోజు ఆకలి తీరింది.

కాని ఇది ఒకరోజుతో తీరే సమస్యకాదు. గాలివాటుగా బ్రతకడం కష్టం. ఏదో ఒక ఆధారం వుండాలి. ఇద్దరూ చాలాసేపు చర్చించుకున్నారు. యే దారీ తోచలేదు. సాయంచేసే బంధువులూ కనిపించలేదు.

చీకటి పడింది. పొద్దంతా తిరిగి వచ్చిన ముష్టివాళ్ళు గూటికి చేరుకున్నారు. సత్రంలో రద్దీ యెక్కువయింది. "జరుగు ముందుకు" అంటూ కేకలు.

సగం రాత్రికి సందడి సద్దు మణిగింది. పుష్ప నిద్ర పోడానికి ప్రయత్నిస్తోంది. దోమల సంగీతంలో కునుకు రావడం లేదు. ధృవుడిమీద చెయ్యివేసి బలవంతంగా కళ్ళు మూసుకుంది.

కలత నిద్రలో మెలకువ వచ్చింది పుష్పకి. ఎవరిదో చెయ్యి ఆమె ఒంటిమీదచేరి చీరముడి తడమసాగింది.

"బాపయ్యా!" అంది కంగారుగా.

ధృవుడు కాదు. లేచి చూసింది. తన ప్రక్క మారెమ్మలేదు. దాని మొగుడున్నాడు. పుష్ప లేవడంతో సర్దుకున్నాడు.

"యేంట్రా సచ్చినాడా?' పుష్ప అతడి పీక పుచ్చుకుని లాగి, కాలితో బలంగా తన్నింది. మారెమ్మ మొగుడు కుయ్యోమన్నాడు.

"తొంగుంటే ఏటవుతాది. కావలిస్తే నీ మొగడ్ని నా పెళ్ళాంకాడ పడుకోమను." మారెమ్మ మొగుడు రాజీ పద్ధతి సూచించాడు.

"సీ యెదవ నోరుముయ్. నీతిమాలిన జనమకాదురా మాది. సెప్పుచ్చుకుని వాయించేత్తాను" పుష్ప వుగ్రరూపంతో అంది

మారెమ్మ మొగుడు, 'డేంజరుకేసు' అని నిర్ధారణపరచుకుని, మామూలుగా పెళ్లాన్ని ఇటు జరిపి అటు పడుకున్నాడు.

ధృవుడు కేకలకి లేస్తాడనుకుంది. లేవలేదు. పుష్ప సంతోషించింది. ఆమె నిర్భయంగా నిద్రపోలేక గోడకి ఆనుకుని కూర్చుంది.

చీకటి రాత్రి నెమ్మదిగా కరుగుతోంది. తెల్లవారితే బాగుండుననిపిస్తోంది పుష్పకి. రోడ్డుమీద వెళ్లే కార్ల హెడ్‌లైట్లు మీద పడుతున్నాయి అప్పుడప్పుడు.

పుష్పకి మాటలు వినిపించసాగాయి. తేరిపార చూసింది. స్థంభం దగ్గర రెండు శరీరాలు కదులుతున్నాయి. "రామే"అంటున్నాడు మొగుడు. పెళ్లాం మూల్గుతోంది. 'నా దగ్గర పడుకోడానికి సత్తావు' మొగుడు సాధింపు.

"సీ....మనుసులుకాదీళ్లు," అనుకుంది పుష్ప.

ఇదో విశ్వామిత్ర సృష్టి. 'నేటి నాగరికతకి నాటి తొలి రూపం' తిండికీ నిద్రకి పరిమితమయ్యే సరళమైన మనుషుల. సంస్కృతి యెదిగినా వాళ్లు ఇంకా అనాదిలోనే వుండడానికి కారణం సమాజం వాళ్లనలా శాసించడమే. యెదగడం పీలుకాక దిగడం నేర్చుకున్నారు వాళ్లు.

## 10

రోజులు యుగాల్లా గడుస్తున్నాయి. నాలుగు రోజులు పస్తులతో గడిపారు. తమ కష్టాలకి అంతం కనిపించడంలేదు. వాళ్లేం అడవిలో లేరు. మనుషుల మధ్య వున్నారు. చుట్టూ హోటల్సు వున్నాయి. ఇళ్లున్నాయి. మేడలున్నాయి అయినా ఆకలి తప్పడం లేదు. మనిషి మందలో బ్రతుకుతున్నా దాని నీడ మీద పడడానికి ఒప్పుకోడు. వెల చెల్లించడం నేర్చుకోవడం నాగరికత చెప్పిన పాఠం.

వాళ్లేమీ ఇవ్వగల స్థితిలో లేరు. అందుకే పస్తులు.

మనం కూడా అడుక్కుందాం బావయ్యా" ఆకలి భరించలేక పుష్ప అన్నది.

"ఛీ....తిండికోసం యెదపపనా?"

ధృవుడు అంగీకరించలేకపోయాడు. గాయాల బాధ తగ్గింది. వూర్లోకి నాలుగైదుసార్లు పోయి వచ్చాడు. యెవరికయినా డ్రయివర్ అవసరం వుంటుందేమోనని లైసెన్సు చూపించమన్నారు.

అది లేదు మరి. వెర్రి ముఖంతో తిరిగి వచ్చాడు.

మధ్యాన్నం పదకొండు గంటలయింది. ముష్టివాళ్లు, సాధువులు కంగారుగా పోవడం చూసి పుష్ప యెక్కడికని అడిగింది.

సర్పంచ్‌గారి తండ్రి చచ్చిపోయాడు. ఆయన పేరుమీదుగా పేదలకి అన్నదానం జరుగుతోంది.

"రావే....ఈ రోజయినా కడుపు నింపుకుందాం" ధృవుడు పిలిచాడు.

తిండి దొరుకుతుందని తెలియగానే పాలిపోయిన పుష్ప ముఖంలో కాంతి వచ్చింది. ధృవుడు పుష్ప వెంట నడిచాడు.

ప్రెసిడెంటుగారి పెరట్లో విస్తళ్లు బారులుగా వేశారు. వందలాది జనం బయట గుమిగూడారు. గేటుదగ్గర పరీక్షించి పంపిస్తున్నారు.

పుష్ప, ధృవుడు మాసిన బట్టలలో, కళ తప్పివుండటంతో సులువుగానే ప్రవేశం దొరికింది. అందరూ కూర్చోడానికి అరగంట పట్టింది. అప్పుడు వడ్డన ప్రారంభమైంది. అన్నం, పులుసు, పులిహోర, ఆ ఆకలి జీవాలకి అదే విందు భోజనం.

భోజనాలు అవుతూండగా ఓ వ్యక్తి అక్కడికి వచ్చి "భోజనాలు అయ్యాక అంతా వెళ్లిపోకండి. బయట పందిరిలో కూర్చోండి. మినిస్టరుగారు వస్తున్నారు" అని అరిచాడు.

గంటయింది. రెండుగంటలయింది. మినిస్టరుగారు రాలేదు. పందిరిలో జనం లేవకుండా పోలీసుల కాపలా.

"మినీస్టరుగారొస్తే మనమెందుకెహె?" ఒకడు విసుగ్గా అడిగాడు.

"ఆయన పేదల నాయకుడంట. సభలో పేదలు లేకుంటే మాటాడడంట...."

సాయంత్రమవుతుండగా ఛవర్లెట్‌లో మంత్రిగారు దిగారు. అక్కడున్న పెద్దల్ని కలుసుకోలేదు ముందర. పేదలమధ్యకి వచ్చాడు దండంపెడుతూ. అల్పసంతోషులు జైకొట్టారు.

కొంతమంది తమ బాధలు చెప్పుకున్నారు.

ఆలస్యమైపోతోందని మినిస్టరుగారు గ్రహించేసి" మీ కోరికలు బాగానేవున్నాయి. మరి సామాన్యుల సంగతేమిటి? మా ప్రభుత్వం బాధ వాళ్ళకోసమే గదా!" అని కప్పగంతువేసి స్టేజి ఎక్కాడు.

"మనం సామాన్యులం గామేంట్రా" ఒకడు కంగారుగా ప్రక్కవాడ్ని అడిగాడు.

"మినిస్ట్రీబాబు అదే సెప్పిండు కదా!"

ఉదాత్తంగా మంత్రిగారు వుపన్యాసిస్తున్నారు. త్వరలో పేదరికం పారిపోతుందని జోస్యం చెప్పారు. దేశంకోసం ఎలాంటి త్యాగమయినా చెయ్యడానికి సిద్ధంగా వుండాలన్నారు. పేదలందరికీ మేడలు కట్టించే పథకం ప్రభుత్వం దగ్గర వుందన్నారు. వచ్చే ఎలక్షన్‌లో తమ పార్టీని గెలిపిస్తే మంచి భవిష్యత్తు వుంటుందన్నారు.

సభ అయిదుగంటలకి ముగిసింది. పుష్ప, ధృవుడు తిరిగి సత్రానికి వచ్చారు. ఇలా సోమరిగా కూర్చోవడం వారికి బాధగానే వుంది. కాని ఏ మార్గం తొక్కడానికీ వెసులుబాటు చిక్కడంలేదు. ఈ రోజు ఆకలిబాధ తీరడంతో మనస్సులు శాంతిగా వున్నాయి.

చీకటిపడేవేళకి బిచ్చగాళ్ళు రాసాగారు. మారెమ్మ ఒక పిల్లవాడ్ని వీపుకి కట్టుకుని రావడం పుష్ప చూపింది.

"నీ కొడుకా?" అని పుష్ప అడిగింది.

"నా యిసయాలు నీకెందుకే, వచ్చినకాడ్నుంచి సూత్తన్నా. నా మీద డిటెక్టివ్‌లా గుంటున్నావు!" అంది మారెమ్మ దెబ్బలాడుతూ.

ధృవుడు పుష్పని పిలిచాడు. దానిగొడవ మనకెందుకే. మన గొడవలోకి అది రావడంలేదు కదా" విసుగ్గా మందలించాడు.

మారెమ్మ, ఆమె మొగుడూ పిల్లవాడ్ని చాపమీదపడేసి కబుర్లు చెప్పుకుంటూ భోజనం చెయ్యసాగారు. వాడు గుక్కపట్టి ఏడుపు మొదలుపెట్టాడు.

రోజూ మారెమ్మా, మొగుడూ దెబ్బలాడుకునేవారు. కాని యివాళ మహాసఖ్యంగా వున్నారు. చెవులు కొరుక్కుంటూ సంకేతంలో చెప్పుకోసాగేరు.

ఒకరాత్రివేళ పుష్పకు మెలకువ వచ్చి చూపింది. పిల్లవాడు ఏడుస్తున్నాడు. మారెమ్మా, మొగుడూ కనిపించలేదు. వాళ్ళ పెట్టెలూ లేవూ.

"ఎవడి కూన్రా ఆ ఏడ్పు. నిద్ర సెడకొడుతున్నాడు" ఓ ముసలాగు బూతు జోడించాడు.

దగ్గరలో వున్నది పుష్ప. ఇక వూరుకోలేక పోయింది. పిల్లవాడ్ని తీసుకుని ఆడించింది. అయినా ఏడుపు మానలేదు. ఎత్తుకుని క్రింద పచార్లు తిరిగింది. పిల్లవాడికి ఏడాది నిండివుంటుంది.

తెల్లవారినా మారయ్య కనిపించలేదు. ఓ ముసలయ్యని అడిగింది పుష్ప వాళ్ళ గురించి. "ఈడ ఎవరు తిరమే పిల్లా. కాసిని రోజులుంటారు పోతారు. యెవరికెవరు, సెప్పిపోడానికి!"

"వీడు వాళ్ళ పిల్లాడయి వుండడు" అన్నాడు ధృద్ధుడు.

"మరి!" పుష్పకి అర్థంకాలేదు.

"వాళ్ళ పిల్లాడయితే వదిలిపోతారా? ఎక్కడ్నుంచయినా ఎత్తుకొచ్చారేమో! అందుకే పారిపోయారు ఈ పిల్లాడి గోల నీకెందుకు? అక్కడ పడెయ్యి. మన బతుకులే తిన్నగా లేవాయె!"

పుష్ప అలా చెయ్యలేకపోయింది.

పిల్లవాడు పాలకోసం ఏడవసాగేడు. వాడ్ని ఎత్తుకుని రామలయంకేసి వెళ్ళింది పుష్ప. పూజ ముగించి అప్పుడే ఆచార్లు ఇంటికెళుతున్నాడు.

"కాసిని పాలు పోయించండయ్యా."

ఆచార్లు మెట్లు దిగుతూ నీతంగా చూసి, "ఇంటికి రా అన్నాడు ప్రక్క సందులోకి నడుస్తూ.

ఆచార్లు భార్య పెద్ద గాజుగ్లాసునిండా పాలు ఇచ్చింది. సగం పిల్లడికి పట్టించి మిగతావి తను త్రాగింది. చేసిన సాయానికి దండం పెట్టి సత్రం దగ్గరకి వచ్చింది.

"ఇప్పుడే వస్తాను" అని ధృవుడు వూళ్ళోకి వెళ్ళాడు.

కాస్సేపటికి నల్ల దుప్పటి కప్పుకుని, గోచితో, చేతిలో కర్రతో మాసిన తెల్లగడ్డంతో కుంటి ముసిలివాడు ఒకడు పుష్ప దగ్గరకి వచ్చాడు.

"పిల్లవాడ్ని నాకు అమ్మేయరాదా! నాల్రూపాయి లిత్తాను" అన్నాడు.

"పెంచుకుంటావా?"

ఆడు మాట్లాడలేదు. దూరంగావున్న మరో ముసలాడు "ఆడి ఎదవం. పిల్లాడ్ని చేతులు ఇరిపించి, కళ్ళు పొడిపించి అడుక్కుంటాడు" చెప్పాడు.

"యేరా నిజమేనా?" పుష్ప గద్దించింది.

"అయిద్రూపాయిలిత్తా సూస్కో."

"సీ....ఎదవ సచ్చినోడా? బంగారంలాంటి పిల్లడ్ని పాడు చేస్తావంట్రా. అయిదేలు యిచ్చినా యియ్యను. పోరా జే!" పుష్ప మండిపడింది.

ధృవుడు వచ్చాడు కాస్సేపటిలో. "రా పుష్పా....మనకి పని తగిలింది. సాయంత్రానికి పదిరూపాయిలు వస్తాయి."

పుష్పని తీసుకుని ధృవుడు చెరువు గట్టుమీదకి వచ్చాడు. అక్కడ వ్యవసాయ కూలీలు గుంపులుగా వున్నారు. ఇంతలో ఓ ట్రాక్టరు వచ్చింది. ధృవుడు, పుష్ప మరో పాతిక మందీ ఎక్కారు. ట్రాక్టరు కాలువ గట్టు దిగి మైలు దూరంలోవున్న పొలాన ఆగింది. కూలీలు బిలబిలమంటూ దిగారు.

వూడ్పుల సీజను. ఇలాగ శరీర కష్టమైనా చేసి పస్తులనుంచి తప్పించుకోవాలని ధృవుడు కూలిపనికి సిద్ధమయ్యాడు.

మామిడిచెట్టు నీడలో పిల్లడ్ని పడుకోబెట్టి పుష్ప పనిలోకి దిగింది. రెండు గంటల పొద్దుకి కూలీలు అన్నాల కోసం గట్టు

యెక్కారు. పుష్ప పిల్లాడ్ని ఆడిస్తూ కూర్చుంది. ధృవుడు ప్రక్క తోటలోనుంచి నాలుగు పెద్ద జామకాయలు కోసి తెచ్చాడు ఇద్దరూ అవి తిని నీళ్ళు త్రాగారు. రాత్రి భోజనంచేసే ఆశవుంది కాబట్టి ధైర్యంగానే వున్నారు.

"నడవండె హే.... కామందు గోరత్తున్నారు" మేస్త్రీ కేక వేశాడు.

అంతా తిరిగి పనిలో జొరబడ్డారు. ఓ అరగంట గడిచేసరికి మేస్త్రీ చేలో దిగి "మామిడి చెట్టు క్రింద బిడ్డడు యెవరాడు?" అని అరిచాడు.

"నా వోడు" అంది పుష్ప.

"రా.... కామందు గోరు పిలత్తన్నారు."

పుష్ప పరుగు పరుగున వెళ్ళింది. ఆయన నంబూద్రి!

# 11

నేల బారుగా వంగిన మామిడిచెట్టు మానుపైన నంబూద్రి సిగరెట్ కాలుస్తూ కూర్చున్నాడు. బిడ్డని యెత్తుకుని ఇంటి పాలేరు పోలయ్య, మేస్త్రీ ప్రక్కన నిలుచున్నారు. పుష్ప దూరాన వుండగానే "వీడు నీ బిడ్డ కదూ?" పోలయ్య గద్దించాడు.

పుష్ప వుక్కిరిబిక్కిరయింది అంతా తనకేసే చూస్తుండటంతో ఆమె కంగారులో బయలుదేరింది. తల ఆడించింది.

"యెత్తుకొచ్చావా?" మేస్త్రీ వెటకరించాడు.

"లేదయ్యా...." అంది నంబూద్రిని చూస్తూ.

"దొరగారూ! ఈ ముండలు మంచిగా చెబితే వినరు. నాలుగు తగిలిస్తే అన్నీ ఆళ్ళే సెబుతారు" అన్నాడు పోలయ్య!

పుష్పకి విషయం కొంచెం అర్థమైంది. మౌనం వహిస్తే విషయం తనని చుట్టుకుంటుందని తెలుసుకుంది.

"నిన్న రేతిరి ఓ ముష్టిది సత్రంకాడకి తీసుకొచ్చింది బిడ్డను. సగం రేతిరికి ఆళ్ళు లేరు. యెవరూ సూడకుండే నేను తీసుకున్నాను బిడ్డని."

"కద సెబుతున్నావా? బాబుగోరి పులిగోరు, వుంగరాలు

కాతేసి దొరికిపోయేసరికిలా మారిచేవు మాట. యెంత కిటుకుల మారి వానివే' అన్నాడు పోలయ్య.

"నేనేం దొంగతనం సెయ్యలేదు. మా బావయ్యని అడగండి."

పుష్ప నాలుగడుగులు వేసి గుట్ట యెక్కి "బావయ్యా!" అని గట్టిగా పిలిచింది. ధృవుడు చూశాడు.

నంబూద్రికి అప్పటికి తట్టింది ఆమె పుష్ప అని. వచ్చేటప్పుడు తిరుగు ప్రయాణంలో పుష్పకోసం హోటల్ దగ్గర ఆగారు. వెళ్ళిపోయారని తెల్సింది. అప్పటినుంచి నిరాశగానే వుంది.

"నీ పేరు పుష్ప కదూ! హోటల్ యెందుకు మూసేశావ్?" నంబూద్రి అడిగాడు.

యజమాని అసలు విషయం వదిలేయడం పోలయ్యకి బాధగావుంది. "ముందు బాబుని యెందుకు యెత్తుకుపోయిందో అడగండయ్యా....నగలు తెమ్మనండి."

ధృవుడు వచ్చాడు.

"నిన్న రాత్రి మారెమ్మ అనే ముష్టిది ఈ పిల్లాడ్ని తీసుకు వచ్చింది" అంటూ ధృవుడు జరిగింది చెప్పుకువచ్చాడు.

నంబూద్రి తల వూపాడు. "నిన్న సాయంత్రం మా కోడలు పిల్లడ్ని ఆడిస్తోంది వీధిలో. ఇంతలో సూదులు, పిన్నీసులు అమ్ముతానని వచ్చింది ఓ ముసలిది. యేవో కొని డబ్బులివ్వడానికి లోపలకి వెళ్ళింది. ఇంతలో పిల్లాడ్ని తీసుకుపోయింది. రాత్రి మంచి తెగ వెతుకుతున్నాం.

"ఆ ముష్టిది యిదే బాబూ" పోలయ్య చెప్పాడు.

"ముందర పిల్లాడ్ని ఇంటి దగ్గర ఇచ్చిరా. తక్కినవి నేను చూస్తాను."

పోలయ్యా, మేస్త్రీ వెళ్ళిపోయారు.

"కష్టమైనా బిడ్డని కాపాడారు" కృతజ్ఞతగా నంబూద్రి అన్నాడు.

వివరంగా జరిగిన కథంతా చెప్పుకు వచ్చింది పుష్ప. "ఇంటి

కాడ బయలుదేరినప్పటినుంచి అన్నీ కష్టాలే బాబూ! నిలవ నీడ లేకుండా ప స్తులతో కాలం గడుపుతున్నాం. ఇంతకంటె సావు నయం కదా!"

"భలేదానివే! కష్టాలువ స్తే చచ్చిపోడమే."

ధృవుడికేసి తిరిగి "బావయ్యా! అయ్యపోయినపుడు సాయం చేసిందీ మా రాజే!" అని చెప్పింది పుష్ప.

"నువ్వు రావడం ఆలస్యమైందన్నమాట" అన్నాడు నంబూద్రి

"సి త్తం."

నంబూద్రి తన సంతోషాన్ని లోలోపల దాచుకున్నాడు. కొబ్బరి బోండాలు తీయించి పుష్పకి ధృవుడికి ఇప్పించాడు.

"కష్టపడినా మంచిచోటుకే వచ్చారు. ఇక మీరేం భయపడ కండి. మీ బాధ్యత అంతా నాది. ఏమంటారు? ఇక మా వూళ్లోనే వుండిపోదురుగాని."

"మీ దయ" అన్నాడు ధృవుడు.

సాయంత్రమైంది. నంబూద్రి కూలీలకి డబ్బు పంచేసి "నడవండి యింటికి పోదాం" అన్నాడు ధృవుడితో.

కాలవ గట్టెంట వెళితే ఇల్లు దగ్గరే. వర్షాలకి గట్టు జారుడుగా వుంది. దమ్ముచేసిన చేలు సంధ్యారాగంలో విఱువైన పాత నగల్లా మెరుస్తున్నాయి. గడ్డిపురుగులు జుమ్మంటూ ఎగురుతున్నాయి.

పావుగంట నడిచి ఊళ్ళోకి వచ్చారు. అంతటా దీపాలు వెలుగుతున్నాయి. పంచాయితీ రేడియో వ్యవసాయం గురించి ఏదో చెబుతోంది.

ఇంటికి రాగానే నంబూద్రి భార్యని కేకవేసి, "వీళ్ళకే మన గిరిగాడు దొరుకుత, కష్టంలో వున్నా రక్షించారు. మరొకరైతే పట్టించుకోరు" వుత్సాహంగా చెప్పాడు.

లీలావతి ప్రశంసంగా చూసింది. "ఇంకా ఇలాంటి మంచి వాళ్లున్నారు కనుకనే ప్రపంచం ఇలాగైనా వుంది."

"ముందర వారికి భోజనం వడ్డించు. ప్రొద్దుటినుంచి ఏం

తినలేదట."

లీలావతి తలూపి వెళ్ళిపోయింది.

"ముందర భోజనంచేసి రండి. తర్వాత మాట్లాడుకుందాం" నంబూద్రి స్నానానికి వెళ్ళిపోయాడు.

నంబూద్రి విశాలమైన పెంకుటిల్లు. చుట్టూ యెత్తయిన సిమెంటు గోడ. ప్రక్కనే మేడ కడుతున్నాడు. అది సగం తయారైంది.

మేడకి ఇంటికి మధ్యనుంచి దారి పెరడులోకి తోవదీస్తుంది. పెరటివైపున ఇంటిచుట్టూ ముళ్ళతీగిల ఫెన్సింగు వుంది.

యెదర వంట షెడ్డు, బాత్రూంలు మధ్యగా తులసి కోట. చుట్టూ మొక్కలూ, పోకచెట్లూ, చివరివైపున పశువుల కొట్టం.

నంబూద్రికి ముగ్గురు మగపిల్లలు. ముగ్గురాడపిల్లలూ. ఆడ పిల్లలందరికీ ఘనమైన సంబంధాలు చేసేశాడు.

పెద్దవాడు సూర్యం. ఆ వూళ్ళో కంట్రోల్ సరుకులకి అతడే డిస్ట్రిబ్యూటర్. అదికాక కొవ్వొత్తుల కంపెనీ, స్టాంపుల వ్యాపారం అతడే చూస్తాడు.

రెండవవాడు సుధాకరం. రైస్ మిల్లు నడుపుతున్నాడు. గణపతి చివరివాడు. వ్యవసాయం చూసుకుంటాడు.

అందరికీ పెళ్ళిళ్ళయ్యాయి. నంబూద్రి వుమ్మడికుటుంబానికి సర్వం సహాధికారి. పర్యవేక్షణ చేస్తూంటాడు. కొడుకులు వారి వ్యవహారాల్లో స్వతంత్రులయినా ముఖ్య విషయాలు తండ్రిని సంప్రదించాలి. పైమాట, నిర్ణయం యెప్పుడూ నంబూద్రివే. కొడుకులు, కోడళ్ళు నంబూద్రంటే దడుస్తారు.

నంబూద్రి రాజకీయంగా స్నేహాలు పెంచుకుని, దానివల్ల తన ఆస్తులని, అంతస్తుని వృద్ధిచేసుకుంటూంటాడు.

నాలుగు రోజులు గడిచాయి. నంబూద్రి ధృవుడి గురించి ఆలోచిస్తూనే వున్నాడు యేం నౌకరీ యివ్వాలా అని. యథాతథంగా వాళ్ళని తన దగ్గరే వుంచుకోదలుచుకోలేదు. పుష్ప అనుమానపడొచ్చు. ఇంతలో ఒక అవకాశం వచ్చింది.

"కాలవమీద బల్లకట్టు నడిపే దొరయ్య పోయాడు. బల్లకట్టు నువ్వు నడుపుకో. పంచాయతీ నెలకి పాతిక ఇస్తుంది. రైతులు, బాటసార్లు సాయంచేస్తారు. పైన నేను యెలాగా వున్నాను కదా!" ధృవుడ్ని పిలిచి చెప్పాడు నంబూద్రి.

"మీరంటే కాదంటానా?"

ప్రధానమైన పంటకాలువ ఆ వూరిమీదుగా వెళుతూంటుంది. వంతెన వూరి చివర వుంది. ప్రజలకి సౌకర్యంగా వుంటుంది బల్లకట్టు. యేటిగట్టు క్రింద పొలాలున్నాయి. కాస్త యెడంగా గోదావరివుంది. రేవులోంచి వచ్చే ప్రయాణీకులకి బల్లకట్టే శరణ్యం.

రకరకాల మనుషుల మధ్య కాలక్షేపం చెయ్యడం, తగినంత ఆదాయం, తమ పూర్వీకుల వృత్తి ఇదే కావడం ధృవుడికి ఆనందంగా వుంది. బల్లకట్టు రేవు దగ్గరగా ఏటిగట్టువార నంబూద్రి పాక వేయించాడు వారి కోసం.

"ఇల్లు తయారై పోయింది. ఇల్లాలు రెడీగా వుంది. ఇంకా ఆగడమెందుకురా? పెళ్ళి కానిచ్చేయండి" అన్నాడు సాయంత్రం నంబూద్రి బల్లకట్టు దాటుతూ.

ధృవుడు సిగ్గుపడుతూ "అదీ మీరే చేయించాల దొరా!" అన్నాడు.

"తప్పుతుందా మరి!"

మర్నాడు రాత్రి సత్యనారాయణ స్వామి కోవెలలో నంబూద్రి ఆధ్వర్యంలో పెళ్లి జరిగిపోయింది, ధృవుడికీ పుష్పకి.

నంబూద్రి ఘనంగా కానుకలు ఇచ్చాడు.

కష్టాలుపడిన తరువాత జరిగే శుభాలు, రోహిణి ఎండలో మాడిపోయిన ప్రకృతి తొలకరి వానకి సంబరపడినట్లున్నాయి.

కాలువమీదనుంచి చల్లటిగాలి వీస్తోంది. పుష్ప, ధృవుడు—యవ్వనం వారిమధ్య మధురగీతం పాడుతోంది. జరుగుతున్న క్షణాలు అలా నిలిచిపోతే బాగుండుననిపిస్తోంది.

"పుష్పా! నేను అదృష్టవంతుడ్ని" అన్నాడు ధృవుడు.

"కాదు నేను" అంది పుష్ప.

"ఇద్దరం అదృష్టవంతులమే.

తర్వాత వాళ్లేమీ మాట్లాడుకోలేదు.

## 12

"యెలక్షన్‌లంటూ ప్రజలను అస్తమానూ విసిగించడం బాగుంటుందీ? పదేళ్ళయినా లేకపోతే అదేం పదవి? రాజ్యాంగాన్ని మార్చివేయండోయ్!" రామినీడు వాదించాడు.

కాని యెవరూ వినలేదు. యెలక్షన్‌లో పాల్గొనక తప్పలేదు. రామినీడు తన నియోజక వర్గానికి వచ్చి, కుక్క పార్టీ తరపున నామినేషన్ పడేశాడు.

అక్కడిదాకా అతడి పని. తర్వాత పని నంబూద్రిదే. ఆయనే నడిపించాలి ప్రధాన వ్యూహాన్ని. రామినీడు నమస్కార బాణాలు వదులుతూంటాడు. అతడికి ప్రజలతో నేరుగా సంబంధం లేదు.

'నక్క' పార్టీ తరపున షణ్ముగం నిలుచున్నాడు. అతడు రాజకీయాలకి కొత్త. అతడి తండ్రి స్వాతంత్ర్య వీరుడు. ఆస్తిలో సగం ఆ వుద్యమానికే ధారపోశాడు. తండ్రి కీర్తితో నించున్నాడు షణ్ముగం.

వీళ్ళిద్దరూ కాక మరో ఆరుగురు ఇండిపెండింట్లు వున్నారు. నెగ్గుదామనికాక, వుత్సాహంకొద్దీ నిలబడ్డారు.

జనం దృష్టి కుక్క, నక్కల మీదే వుంది.

యెలక్షన్ గాలి అందుకుంది. గోడలు ఖరాబయ్యాయి. జెండాలు రెపరెపలాడాయి. యెక్కడ చూసినా సభలు. సామాన్యుడి చుట్టూ గొప్పవాళ్లు తిరుగుతున్నారు. పోలింగ్ తేదీ దగ్గరపడేకొద్దీ ప్రధాన పార్టీలు మరింత వుధృతంగా పనిచేస్తున్నాయి. వాగ్దానాలకి విలువపోయింది. డబ్బు అజ్ఞాతంగా పరుగెడుతోంది.

పోలింగ్ పూర్తయింది.

మర్నాడు కౌంటింగ్ ప్రారంభమయింది. తాలూకా ఆఫీసు చుట్టూ జనమే. కార్యకర్తలు ఏజెంట్లు రద్దీగా వున్నారు.

అభ్యర్థులు ఫోన్ల దగ్గరున్నారు.

మరోవైపు బ్యాండు, బాణసంచా పురమాయింపు జరుగుతోంది.

మధ్యాహ్నం రెండుగంటలకి షణ్ముగం ఆరువేల ఓట్ల మెజారిటీలో వున్నాడు. మరోగంటకి పదివేల మెజారిటీ. రామినీడు కదలలేదు.

నంబూద్రికి అర్ధమైపోయింది. 'ఇప్పుడే వస్తాను' అని రామినీడు ఇంటి దగ్గర్నుంచి కార్లో యింటికి వచ్చాడు.

కారుకి కుక్కపార్టీ జండా తీసేశాడు. నక్కపార్టీది తగిలించాడు. రోడ్డే ఒక వెళుతున్న ఒక నక్కపార్టీ ప్రముఖ కార్యకర్తని పిలిచి మనవాడు లీడింగ్‌లో వున్నాట్ట కదా" అన్నాడు. ముందర విస్తుపోయినా అతడూ రాజకీయపు మనిషే గనుక అర్థం చేసుకుని "మన శ్రమ వూరికే పోతుందా...." అన్నాడు.

టీ త్రాగి వరండాలో కూర్చున్నాడు. ఏజెంట్లు వచ్చి రామినీడు ఎంత వెనకబడ్డాడో చెబుతూంటే వాళ్ళని తిట్టి, "షణ్ముగం లీడింగ్ చెప్పండి" అన్నాడు.

అయిదయ్యేసరికి అధికారరీత్యా షణ్ముగం విజయం తెలిసింది.

నంబూద్రి కారు, జీపు, రెండు ట్రాక్టర్లు షణ్ముగం వూరేగింపుకు పంపించాడు వెంటనే. షణ్ముగం నంబూద్రిని రమ్మని కబురుపెట్టాడు.

గుమ్మం దిగుతూండగా రామినీడు పాలిపోయిన ముఖంతో కారు దిగాడు. "మనల్ని ముంచేశారయ్యా."

"తట్టుకోవాలి మరి. ప్రజలతీర్పు. కాదనలేం కదా!"

"చచ్చుముండాకొడుకుని గెలిపిస్తారా? ఇంతకంటె అన్యాయం వుందా?" పదవిపోవడంతో పిచ్చిఎక్కినట్లుంది రామినీడుకి.

ఈ ఆలస్యం భరించలేకపోతున్నాడు నంబూద్రి. ఇక రామినీడు గుండ్లులేని తుపాకీ. పిల్లికూడ భయపడదు.

నంబూద్రి ఏ ఎండ కాగొడుగు పట్టేరకం.

"ఎక్కడికో బయలుదేరినట్లున్నావ్?" రామినీడు అడిగాడు అశాంతిగా.

షణ్ముగం దగ్గరకి అని చెప్పలేక, "మా పెద్దమ్మాయి అర్జంటుగా రమ్మని ఫోన్‌చేసింది" అన్నాడు.

పుష్ప వులవల సంచి తెచ్చి అరుగుమీద పెట్టి "పోలయ్య యింటికి సుట్టాలు వచ్చారంట. దీన్ని యింటికాడయియ్యమన్నాడు" అన్నది.

"పశువుల కొట్టంలో వెయ్యి. కాపిని వుడకేసి ఎడ్లకి వెయ్య మని నాగన్నతో చెప్పు" ఆదేశించాడు నంబూద్రి.

"ఎక్కడో చూసినట్లే వుంది."

"గాలివాన! హోటలు....పుష్ప....ముసిలాడు చచ్చాడు.

"ఆ బంగారమా? నీకెలా వచ్చింది? చప్పరించేశావా?"

"ఏం లేదులే. తర్వాత చెబుతాను. అర్జంటుగా పని వుంది" కారెక్కాడు.

రామినీడుకి ఎలక్షన్లు ఓడిపోయిన బాధకంటే, నంబూద్రి పుష్పని గెలుచుకున్నాడేమోనన్న బాధ ఎక్కువైంది.

నాలుగురోజులు యింట్లోనే కాలక్షేపం చేశాడు. పార్టీ మారితే చిన్న కుర్చీలయినా దక్కుతాయేమోనని సంచారం చేసివచ్చాడు. నో వేకెన్సీ. కొంతకాలం విశ్రాంతి తీసుకోమన్నారు పెద్దలు. రామినీడు యింటికి వచ్చాడు.

ఓ రోజు లంకపొలం నుంచి తిరిగివస్తూండగా కాలువ గట్టుమీద పచ్చగడ్డికోస్తూ పుష్ప కనిపించింది.

గోచీపోసిన కనకాంబరం చీరలో, కొత్తగాడుకు తెరిచినట్లున్న పుష్పతో మాట కలపాలనిపించింది.

"పశువులున్నాయా? దగ్గరకెళ్ళాడు.

పుష్ప తల ఎత్తింది. తలూపింది.

"గేదే? ఆవా?

"గేదె."

"పాలు బాగా యిస్తుందా? ఏ మాత్రం?"

"రెండు సేర్లు."

"అమ్మేస్తున్నారా?"

"మరే."

"వట్టిగడ్డి కావలిస్తే మన గడ్డివాములోది తీసుకోండి."

"వద్దులెండి."

"ముఖమాటం పడక."

పుష్ప గడ్డి గంపలో కూరింది. నెత్తిమీద పెట్టుకుని బయలుదేరింది. రామినీడు కూడాపడ్డాడు. "నంబూద్రి ఇక్కడకి తీసుకువచ్చాడా మిమ్మల్ని?"

"పొట్టకోసం మేమే వచ్చాం" విసురుగా అంది.

ఇల్లు రానేవచ్చింది. రామినీడు కాసేపు తచ్చాడి వెళ్ళిపోయాడు. గేదెకి గడ్డివేసి పొయ్యి వెలిగించింది. వంటయ్యేసరికి సూర్యుడు వజ్రంలా కఠినంగా మెరుస్తున్నాడు.

ధృవుడు బల్లకట్టు దిగివచ్చాడు. పుష్ప అన్నం వడ్డించింది.

"ఆసుపత్రికి ఎల్లా వంట పొద్దుట" అన్నం కలుపుతూ అడిగాడు.

"అప్పుడే ఎవరూదారు?"

"పింగన్న సెల్లెలు. నిజమేనా?"

"నేను సెప్పను."

"అదేటి?"

"అంతే" పుష్ప నవ్వుతాలుగా అంది.

"డాక్టరుబాబునే ఆడుగుతా.

ధృవుడు భోజనంచేసి చుట్ట వెలిగించాడు. పుష్ప అన్నం తినకుండా డబ్బాలు సర్దడం చూసి "అన్నం తిన్నావా?" అడిగాడు.

"కడుపు నిండిపోయింది."

ధృవుడు లేచాడు. సంగతి తెలిసింది. పుష్పని అందుకుని బొంగరంలా తిప్పాడు. పుష్ప పొంగులువారుతూ నవ్వింది కితకితలకి.

"అదేటో చెప్పనా....తమరు అమ్మగారవుతున్నారు" పుష్పని దగ్గరకి తీసుకుని గడ్డంరాస్తూ చెప్పాడు.

"తమరు మరి?" పుష్ప ఎదురడిగింది.

"నేను సెప్పను."

"అదేటి"

"అంతే."

నవ్వులూ, కేరింతలు వాళ్ళమధ్య.

# 13

వాన కురుస్తోంది. జనం లేకపోవడంతో బల్లకట్టు కట్టేసి గట్టు ఎక్కాడు. ఇవతలవైపున కిళ్ళీబడ్డీలు, కిళ్ళీదుకాణం ప్రక్కనే కాఫీ హోటలూ వుంది. వరడాంలో చాలామంది వానకి గుమిగూడారు. ధృవుడు చుట్టకాలుస్తూ అక్కడ కూర్చున్నాడు. వాన వుధృతంగా కురుస్తోంది. రోడ్డుమీద పిల్లలు తడుస్తూ పరుగుతీస్తున్నారు.

అరగంటకి వాన తగ్గింది. ఇంకా జల్లులు పడుతున్నాయి. ఏటిగట్టునుంచి కొంతమంది రైతులు బల్లకట్టుకోసం ధృవుడిని పిలుస్తున్నారు. ఇంకా వానగా వుందని సందేహిస్తున్నాడు. అసలే తల భారంగావుంది. వర్షంలో తడిస్తే యింకా ఖరాబవుతుంది.

"కేకవేస్తుంటే కదలవేంరా?" కిళ్ళీకొట్టు ఆసామీ ధృవుడ్ని మందలించాడు.

తడిసిపోతూ బల్లకట్టు నడిపాడు. రైతులు తొందరగా రాలేదని సణుగుతున్నారు. ధృవుడు మాట్లాడలేదు. వూరుమ్మడి బ్రతుకు తనది. ప్రతీవాడూ యిచ్చేటప్పుడు వెనకా ముందూ చూస్తాడు కాని పెత్తనం చలాయించేటప్పుడు ముందే వస్తారు. వాళ్ళని దింపేసరికి రామినీడు ఎక్కాడు.

అతడి పొలం ఏటి అవతలవున్నా వ్యవసాయం అల్లుడే చూస్తాడు. పుష్ప దర్శనానికి రామినీడు పొలంవంకన బయలుదేరాడు. పుష్ప కొరకరాని కొయ్యయిపోయింది. ఏ ఎత్తూపనిచేయడంలేదు. ఇటునుంచి నరుక్కురావాలనుకున్నాడు.

ధృవుడ్ని దువ్వాడు. మాట కలిపాడు. తనకేసి లాక్కున్నాడు.

"ఎండా వాననక ఏం కష్టపడతావురా? ఎన్నేళ్ళు యేడిసినా నీ బ్రతుకు యింతే. మరింత చిక్కిపోతావు తప్ప బాగుపడవు. నంబూద్రి శిఖరం ఎత్తుతాడనుకుంటున్నావేమో! అది కల. ఎవరి వల్లనైనా వాడు బాగుపడతాడు కాని బాగుచేయడు."

బల్లకట్టు ఈ దరికి వచ్చింది. జనంలేక కట్టేశాడు. రామినీడు మొదట తన అక్కసంతా తీర్చుకున్నాడు నంబూద్రిపై, అతడు షణ్ముగం బంటు అయినందుకు.

"నిజమే దొరా!" అన్నాడు ధృవుడు.

"నువ్వంటే నాకు జాలి వుంది. కాలవగట్టుమీద సోములబడ్డీ అమ్మేస్తానంటున్నాడు. నీ కోసం రెండువేలకి బేరంచేశాను."

"డబ్బు ఏదండీ! కిళ్ళీకొట్టు కొనడం మాటలా!"

"అలా అధైర్యపడకు. నేను యిస్తాలే. నెలనెలా తీర్చు కుందువుగాని. రోజుకి ఇరవైకి తక్కువ మిగలదు.

"మంచి వ్యాపారం సోములు ఎందుకు అమ్మేస్తాడండీ!" సందేహించేడు.

"అండమాను పోతున్నాడు. నీ కిష్టమేనా చెప్పు ముందర."

బంగారంలాంటి అవకాశం. కూర్చున్న చోటునుంచి కదల కుండా సంపాదించవచ్చు. "మీ దయ."

"అయితే సాయంత్రం బేరం పైసలు చేసేస్తా!" రామినీడు కదిలాడు.

ధృవుడికి ఆ మాటలు విన్నాక బల్లకట్టుపని చండాలంగా తోచింది. అసంతృప్తి రేగింది. అశాంతి కీటకంలా ప్రవేశించి తొలిచేసింది.

సంసారం తగినంతగా వెళ్ళిపోతోంది. అయినా ధృవుడికి నచ్చలేదు. సంపాదించాలి. నలుగురిలో మంచిస్థానం పొందాలి. ఇదీ యావ.

ఇంటికి భోజనానికి వెళ్ళినపుడు పుష్పతో చెప్పేశాడు. "నౌకరీ మానేస్తున్నా."

"గవర్నేరు సేత్తావా?" పుష్ప పిల్లడ్ని కాళ్ళమీద పడుకో బెట్టుకుని పాలుపోస్తోంది.

"సెయ్యలేనా!" పిల్లడ్ని గారాబం చేస్తూ అన్నాడు.

"అన్నానా!" పుష్ప నవ్వింది.

ధృవుడు చెప్పాడు.

రామినీడు ద్వారా అని తెలియగానే కొయ్యబారిపోయింది. ఉద్రుడియంగా వాడెందుకు సాయంచేస్తాడు? ఏదో వల వేశాడు!

"నా కిట్టంలేదు."

"నీ బోడిట్టం ఎవుడికి కావాలేస్! అయినా ఎందుకిట్టంలేదు?"

గుచ్చిచూస్తూ అడిగాడు.

"ఆడు ఎదవ కనుక!"

"నీ కెలా తెల్సు!"

చెప్పాలని వుంది. చెప్పలేకపోయింది పుష్ప.

"తెలిసీ తెలీని కబుర్లు సెప్పక!" విసురుగా లేచి విస్తరి ముందు కూర్చున్నాడు. గిన్నెల్లోవి తానే వడ్డించుకున్నాడు.

"ఇంతచేసిన నంబూద్రిబాబుతో సెప్పుద్దాం! ఆయనేమంటారో."

"మధ్యన ఆయనెవరు? మనం ఆళ్ళ పాలేర్లమా? అయ్యాక చెప్పచ్చు!"

అది కృతఘ్నతగా కనిపించింది పుష్పకి. రామినీడు ఎరలో పడిపోయాడు బావయ్య. పుష్ప వుక్రోషంగా పిల్లాడితో అక్కడ్నుంచి లేచివెళ్ళిపోయింది. తిరిగి ధృవుడు వెళ్ళిపోయేదాకా బయటే తిరిగింది. పిల్లాడ్ని గుడ్డఉయ్యాల్లో వూపుతూ కూర్చుంది.

బావయ్యని తను ఎనక్కి లాగడమెందుకు? నంబూదిరిగోరు మాతరం కాదంటారా పెయోజకుడైతే. బావయ్య రామినీడు సాయం పొందితే పొందనీ తనకేం. ఆడు తననేం చెయ్యగలడు?

పుష్ప అలాగని రాజీపడలేకపోయింది. దుష్టుడికి మొదటి నుంచీ దూరంగానే వుండాలి అనిపించింది.

ధృవుడు రాత్రి బాగా ఆలస్యంగా యింటికి చేరుకున్నాడు. అన్నంజోలికి పోక మంచం ఎక్కాడు. సారావాసన గుప్పుమంది పుష్పకి.

"బడ్డీ కొన్నందుకు పారిటీ సేసావేంటి?" ఎద్దేవగా అడిగింది.

"ఇంకా ఎక్కడే. సోములు వూరికెళ్ళాడు. రేపు రావాలి వాడు. అప్పుడు."

"అందాకా నువ్వూ రామ్నీడు తాగి గెంతులేత్తారా?"

పుష్పకోపం ఎక్కువైంది. ధృవుడికి పూర్వం త్రాగుడు అలవాటు లేదు. ఇదంతా రామినీడు మహాత్యం అనుకుంది.

"ఏదో సేత్తాం....ఆడదానివి నీ కెందుకే!" మైకంగా

అన్నాడు.

"పెద్ద మొగోడివి బయలుదేరేవు" పుష్ప అతడిపైకి ఆవేశంగా వంగింది. "బావయ్యా.... ఇలా నువ్వుసెడిపోతే నేను భరించలేను. రామ్నీడు నన్ను నాసినం సెయ్యడానికే యిదంతా సేత్తాడు."

ధృవుడు రివ్వున లేచాడు. పుష్ప చీరకొంగు లాగి వీపుమీద గుద్దాడు. చెంపలు వాయించాడు. "ఎదవ వాగుడు వాగితే నరికేత్తాను."

పుష్ప ఏడుస్తూ పడుకుంది. దెబ్బలు తిన్నందుకు కాదు. భర్త మీద పడిన రామినీడు ప్రభావానికి. నంబూద్రికి, రామినీడుకి సయోధ్య లేదని పుష్పకి తెల్సు. రామినీడు సాయంపొందితే ఆయనేమనుకుంటాడో? నంబూద్రి తమని కాపాడేడు. దారి చూపించాడు. ఈనాడు ఆయన్ని ఎదిరించడమా? ప్రస్తుతం తాము ఘనంగా బ్రతకలేకపోయినా లోటులేదు. పురాతన కులవృత్తికి వచ్చారు.

ఉదయం లేవగానే ధృవుడికి రాత్రిగొడవ జ్ఞాపకం వచ్చింది. భార్యని కొట్టినందుకు సిగ్గుపడిపోయాడు.

"తొందర పడ్డాను!...." సంజాయిషీగా అన్నాడు టీ కాస్తున్న పెళ్ళాంతో.

పుష్ప ఏం మాట్లాడలేదు. నిరితంగా చూసింది.

రెండ్రోజులు గడిచాయి. పుష్ప మాట్లాడకపోవడం ధృవుడికి వెర్రెత్తినట్టుంది. బయట ఎంత కష్టపడి పనిచేసి వచ్చినా, యింటికి వచ్చేసరికి ఆమె చల్లని చిరునవ్వుతో ఆ శ్రమ మరిచిపోయేవాడు. ఇప్పుడదేమీ లేదు. తలివిడిగా తను మాట్లాడినా రాయిలా కూర్చుంటోంది పుష్ప.

ఆమె ప్రసన్నం కావాలి.

అంటే తన ప్రయత్నం మానెయ్యాలి. ధృవుడికి కొంచెం బాధగానే వుంది. పుష్ప పొరపాటు పడినట్లు రుజువు చెయ్యాలనుకున్నాడు. కిళ్ళీబడ్డీ ద్వారా రోజుకి యెన్ని రూపాయలు లాభం వస్తాయో చెప్పాడు. నెక్లసు చేయిస్తానని ఆశ పెట్టాడు.

"నన్ను రాణమ్మను సేయక్కరలేదు. ఇలా వుంచు సాలు-

నువ్వు కళ్ళుదుకాణం తెరిస్తే గోదారి పాలవుతాను నేను" స్థిరంగా చెప్పింది.

ధృవుడు గుక్క తిప్పుకోలేకపోయాడు.

"ఇంకా మీనమేషాలు లెక్కపెడతావేంరా? అవతల సోములు వెళ్ళిపోవాలని కంగారు పడుతున్నాడు" రామినీడు హెచ్చరిస్తున్నాడు.

అటు డబ్బు ఇటు భార్య.

ఏది కావాలి?

ఏది తిరస్కరించాలి?

కడుపునిండా సారా త్రాగుతున్నా శాంతిగాలేదు పుష్ప మాట్లాడకపోవడంతో. తను కళ్ళుబడ్డి కొంటే అన్నంతపని చేస్తుందేమో!

పుష్ప లేకుండా తను....వూహించలేకపోయాడు.

వద్దని చెప్పేశాడు రామినీడుతో.

పుష్ప ఆనందానికి అంతులేదు. అతని గుండెలపై వాలిపోయింది.

"ఇన్నాళ్ళ బాకీ వసూలు చేసుకోవాలి" అన్నాడు ముద్దెట్టుకుంటూ.

## 14

ధృవుడు మారిపోవడం రామినీడుకి నిరాశే కలిగించింది. అయినా వూరుకోలేకపోయాడు. పుష్ప సౌందర్యం వూరుకోనివ్వడంలేదు. 'సాధించాలి' అనే పట్టుదల కల్గింది. ఒకరోజున పట్నం వెళదామని బస్సు ఎక్కాడు. బస్సు ఖాళీగా వుంది. వెనక సీట్లో కాళింది కనిపించడంతో ఆమె దగ్గరకి వెళ్ళాడు.

"నా కొదిలేయండి బాబూ" అంది కాళింది.

"అయిదువందలు."

కాళింది ఒప్పుకుంది. రామినీడు అయిదువందలు అప్పుడే ఇచ్చేశాడు. నోట్లను కాళింది జాకెట్టులో పడేసుకుంది.

కాళిందిని వయస్సు ముప్ఫయి వున్నా యిరవయ్యే అంటారు జనం. సారాకొట్టు వ్యాపారమున్నా, శరీరాన్ని కూడ వ్యాపారంలో పెట్టేసింది. ఆమె మొగుడు వీరనారాయడు బాగ్దాద్ వీరుడు.

ప్రభుత్వజైల్లో శాశ్వతసభ్యుడు. మొగుడు చుట్టంలా అమావాశ్యకీ పున్నమికీ యింటికి వస్తే సంసారం ఎలా గడుస్తుంది? అందుకే 'కాళింది రంగంలోకి దిగింది. వీరనారాయడికిది తెలిసినా తెలీనట్లు వుంటాడు.

రెండ్రోజుల తర్వాత, ఓ మధ్యాహ్నం పొగాకుకోసం వూళ్ళోకి వెళ్ళాడు ధృవుడు. కాళింది యిల్లు అమ్మవారి గుడికి ఎదురుగానే వుంది. ధృవుడ్ని పిలిచింది.

చుట్ట చుట్టుకుంటూ వస్తూ "రేతిరీ పగలూ వస్తే మా పని అయినట్టే. సందేళ వస్తాగా!" అన్నాడు గుమ్మంలో ఆగి.

అరుగుమీద సారా కుండలున్నాయి. మధ్యాహ్నం సమయం కాబట్టి జనం అంతగాలేరు. కాళింది నీలంఅంచు తెల్లచీర కట్టింది. ఎర్రరవిక తొడిగింది. కొప్పు పూలతో నిండుగా వుంది. 'బావయ్యకి మరదలంటే భయం" అంది అదోలా నవ్వి.

"భయం యెందుకు?" ధృవుడు కూర్చున్నాడు ఆ నవ్వుకి కరిగి.

కాళింది సారా అందించింది. డబ్బులు లేవన్నాడు ధృవుడు "నే నడిగితే కదా" అంది కాళింది. "అరువయినా యిచ్చుకోవాలి కదా" అన్నాడు. ఆ భయం వద్దంది.

ధృవుడు గ్లాసుమీద గ్లాసు త్రాగేడు. నడిచి యింటికి వెళ్ళడం గగనమైపోయింది. పుష్ప భోజనానికి పిలిచినా లేవలేదు. మత్తుగా నిద్రపోయాడు. సాయంత్రం మెలకువ వచ్చింది. తిరిగి సారా కావాలనిపించింది. కాళింది దగ్గరకి పరుగెత్తాడు. కాళింది సాదరంగా ఆహ్వానించింది.

అందరిలా కాకుండా లోపల తన గదిలో కూర్చోపెట్టింది సీసాయిచ్చి. సీసా అయ్యేసరికి తొమ్మిదయింది. కాళింది కోడికూర ఆవకాయతో అన్నం పెట్టింది.

భోజనంచేసి "పోయిరానా?" అన్నాడు.

"నిన్ను వెళ్ళమన్నదెవరు?" కాళింది తలుపు వేసింది.

ధృవుడికి అర్థం కాలేదు. కుర్చీలోనుంచి లేచాడు.

కాళింది యవ్వనాన్ని మంచంమీద ఆరబోసినట్లు పడుకుంది. మేజామీద దీపం తగ్గించింది. ధృవుడికి తను ఎటు వెళ్ళాలో తెల్సింది.

ఉదయం పదిగంటలకి మెలకువ వచ్చింది ధృవుడికి. ఆలస్యమైనందుకు కంగారుపడిపోయాడు. పుష్ప తనకోసం ఎదురుచూస్తూ వుంటుంది.

అతడు వెళ్ళడం చూసి "సాల్లే....మా సెల్లేం బెంగపడదు. నువ్వంటే ఎంతో యిదిగా వుంది. సందేళ ఎళుదువుగానిలే" అంది కాళింది టిఫిన్ యిచ్చి.

"కనపడి వచ్చేస్తాగా."

అతడి మెడచుట్టూ చేతులు వేసింది. వీపుపై వంగి "నిన్ను వదిలి నేనుండలేను" అంది గోముగా.

ఆ మంత్రానికి కట్టుబడిపోయాడు.

ధృవుడు సారాలో స్నానం చేస్తున్నాడు. కాళింది అందాన్ని నంజుకుంటున్నాడు. కాలం కరుగుతోంది. ఏ బాధా, శ్రమాలేదు.

నాలుగు రోజుల తర్వాత బట్టలకోసం యింటికి వెళ్ళాడు. పుష్ప ఏడుస్తూ మీదపడింది. "ఏమైపోయావురా? ఏడకి పోయావు. ఈడ ఆడ తిరిగి సచ్చాను. సెప్పిపోతేనేం?"

కాళింది యిల్లు స్వర్గం. ఈ యిల్లు నరకంలా వుంది. 'యింటి కొచ్చేపరికి ఏడుపు ...చీ....అనేక పనులుంటాయి. నీతో చెప్పాలా?"

అతడు మందుమీద వున్నాడని తగ్గిపోయింది పుష్ప.

ధృవుడు బట్టలు సంచీలో పెట్టుకుని తిరిగి బయలుదేరడం భరించలేక అతడి కాళ్ళకి అడ్డంగాపడింది.

తన్నుకుంటూ వెళ్ళిపోయాడు.

పుష్ప వెక్కి వెక్కి ఏడ్చింది. కన్నీళ్ళతో ముఖం వుబ్బిపోయింది. పిల్లవాడు ఏడ్చినా వూరుకోబెట్టలేదు. "నిన్ను నేను వూరోకోబెడతారా? నన్నెవరు ఓదారుస్తారు?" అనుకుంది.

చిన్నప్పటినుంచి ధృవుడ్ని భర్తగా ఆరాధిస్తోనే వస్తోంది.

కల నెరవేరింది. ఎన్ని బాధలున్నా ధృవుడ్ని పొందడంతో మరిచి పోయింది. అతడు తన స్నేహాన్ని కాదని దూరంగా జరిగిపోవడం భరించలేకపోయింది.

పుష్ప రాత్రయినా అలాగే గుమ్మానికి జార్లబడి కూర్చుండి పోయింది. ధృవుడు ఎక్కడికి వెళ్ళాడు? యెప్పుడు వస్తాడు? మళ్ళీ వస్తాడా?

భయపెట్టే ప్రశ్నలు.

భళ్లున తెల్లారింది. బిల్లకట్టు దగ్గర ధృవుడు లేనందుకు పది మందీ ఇంటిమీదకి వచ్చి పడ్డారు.

వూరికెళ్లాడండి. వచ్చేస్తాడండి.

"ఆ దొరగారు వచ్చేదాకా కూర్చుంటామా...నువ్వున్నావుగా.. రా." అన్నాడొకడు.

అందరూ అదే అన్నారు.

పుష్పకి తప్పలేదు. బిల్లకట్టు నడపసాగింది. నువ్వు వచ్చా వేం? నీ మొగుడేడి?——....కొంతమంది వెటకారాలు.

పుష్ప కుళ్ళిపోయింది. యెవరికీ యేం చెప్పలేకపోయింది.

అటు ఇంటిపని. పిల్లాడ్ని ఒంటరిగా వదిలేయవలసివస్తోంది. ఇటు జనం కాకుల్లా పొడుస్తున్నారు.

"నౌకరీ నీకు అప్పగించి వాడు కాళిందితో కులుకుతున్నాడన్న మాట. బాగుందే. నువ్వింత అడవి మాలోకాని వన్నమాట" పాల గంగమ్మ అందోరోజున.

పిడుగుపడింది.

వెంటనే పని వదిలి రోడ్డు యెక్కింది. కాళింది ఇల్లు తెల్సు కుంది. ధృవుడు భోంచేస్తున్నాడు. కొసిరి కొసిరి తినిపిస్తోంది కాళింది.

ఆ దృశ్యం రంపంలా కోసేసింది.

ధృవుడు చూసినా చూడనట్లు నటించాడు. కాళింది మాత్రం "రావే సెల్లీ, నీ మొగుడ్ని నేనేం కొరుక్కు తినీయడం లేదు" అంటూ నవ్వింది.

"నీ నువు కాపరం సేసే అకదానివేనా? పరాయి మొగాడ్ని ఇంట్లో పెట్టుకుని కులుకుతావా? నా కొంపలో నిప్పులు పోత్తావా?" పుష్ప ఆవేశంతో చెలరేగింది.

కాళింది నచ్చచెప్పబోయినా ఆమె ఆగలేదు. దాంతో కాళింది కూడా నోరు పారేసుకుంది. ఇద్దరూ రోడ్డు కెక్కారు.

జనం మూగారు. ఛోద్యం చూస్తున్నారు.

"సూడండయ్యా. దాని మొగుడ్ని నేను బందించేపినానా? గోరం కాదా? పిలిచి తీసుకెళ్ళమనండి" అంది జనంలో కాళింది.

ధృవుణ్ణి రమ్మంది పుష్ప.

ధృవుడు కదలలేదు. రానన్నాడు. ఇక తను కాళిందితో దెబ్బలాడటం అనవసరమనిపించింది. తన బంగారం అలా వుంది. పుష్ప ఇంటికెళ్ళింది. పిల్లాడు వుయ్యాలలోంచి క్రిందపడి ఏడుస్తున్నాడు. చిన్న గాయమైంది కూడ.

"ఇదంతా నా కరమ" పుష్ప వాపోయింది.

ఆడు తెలిసి చేస్తున్నాడు. ఎవరేం సెయ్యగలరు? ఆ దేవుడే ఆడి బుద్ధి మార్పించాలి.

ఆ రాత్రి తలుపు కొడుతూంటే భర్త అనుకుని ఆశగా తెరిచింది. కాదు రామినీడు. గుమ్మానికి అడ్డుగానే నిలబడి "యెందుకు వచ్చావు?" గద్దించింది.

"నీ కోసమేనే" కుడిచేయి నడుంచుట్టి మంచంకేసి తీసుకెళ్ళాడు.

"ఏందిరా ధైర్యం నాయాలా" పుష్ప విడిపించుకుంది.

"నీ మొగుడు ఆ కాళిందితో తిరగడం లేదా? నువ్వు నా దగ్గర పడుకుంటే ఏం!"

"అది లంజరా! నేను అలాంటిదాన్ని కాదు."

"ఎలాంటిదానివయినా ఈ రాత్రి నీతో పొందు ఖాయం. "రామినీడు ముందు కురికాడు. మంచంపైకి త్రోశాడు.

పుష్ప పెనగులాడింది....క్రిందపడింది. దీపం బుడ్డి కాంతిలో దగ్గరలో కత్తిపీట కనపడింది. చీరవూడిపోతున్నా కత్తిపీట అందు

కుంది. "అడుగేశావా? తెగేస్తా...."

రామినీడు తిరోగమించాడు. కాళింది ఇంటి దగ్గర ఆగి పిలిచాడు.

కాళింది బయటికి వచ్చింది.

"ఆ వెధవని బయటకి తగలేయ్!" రామినీడు ముందుకెళ్ళాడు.

కాళింది కర్తవ్యమైంది.

# 15

నంబూద్రి పలుకుబడి అన్ని విషయాల్లోను వుపయోగిస్తుంది. ఖరీదైన పెళ్ళి సంబంధాలు అతడిద్వారా కుదురుతూంటాయి. కట్నం రేటు దగ్గర అతడి మాట బాగా పనికివస్తుంది కాదని యెవరూ చెప్ప లేరు. తనకు 'బహుమతి' ముట్టజెప్పినవారికి లౌక్యంగా సాయం చేస్తూంటాడు.

ఇంటి దగ్గరే మధ్యాహ్నం పదకొండు గంటలనుంచి సాయం త్రం నాలుగు గంటలదాకా నలిగిన పెళ్లిసంబంధాన్ని సరిజేసి ఇరు పక్షాలని పంపేశారు. టౌన్‌కి వెళ్లే పని వున్నా అలసటగా వుండటం వల్ల తోటలోని రెస్ట్ హౌస్‌కి బయలుదేరాడు టీ త్రాగి.

నంబూద్రికి వూరి చివర సర్విచెట్ల తోటవుంది. తోటముందర చిన్న బంగళా కట్టించాడు. ఆయన అక్కడవుంటే ఇంటికి సంబం ధించినవారుగాని, ఇతరులుగాని వెళ్ళడానికి జంకుతారు.

ఈరూలు పోలయ్యకి వర్తించదు. వాడు పాలేరయినా ఆయన నమ్మినబంటు. అయ్యగారి సరదాలు అమర్చడం వాడి పని.

నంబూద్రి రెస్ట్ హవుస్‌కి వచ్చి వరండాలోని ఈజీచైర్‌లో కూర్చున్నాడు. సర్వి తోటగాలికి పాటపాడుతోంది. సాయంత్రం ముత్తయిదువు చిరునవ్వులా వుంది.

పోలయ్య యెదర మేజాపెట్టి విస్కీ కోడిగారెలు ముందర పెట్టాడు. "....దానికోసం యెల్లివస్తానండి."

"ఆలస్యం చెయ్యకు."

పోలయ్య వెళ్ళగానే మందు చప్పరిస్తూ, గారెలు చూస్తూ యేకాంతాన్ని అనుభవించసాగేడు.

ఎనిమిది గంటల ప్రాంతంలో మత్తుతో జోగుతున్న నంబూద్రి దగ్గరకి "సదాలచ్చిమి వచ్చిందంటూ" పోలయ్య వచ్చాడు.

"పుష్ప కాదూ!"

"దానికోసం ప్రయత్నించానండి. మొగుడితో సినీమాకి ఎల్లింది."

నంబూద్రికి నిరుత్సాహంగా వుంది. పుష్పని పొందాలని వుత్సాహంగా వుంది. వీలుకావడంలేదు. "అదేంట్రా? అది అప్పుడే పిల్లాడ్ని కనేసింది. ఇంకా మన దగ్గరకి రాలేదు."

"అది స్పెషల్ కేసండి. ఇందు భోజనం పొందాలంటే ఆలీసం కాదుటండీ."

నంబూద్రి నవ్వాడు. "సన్నాసెదవా! కబుర్లు సెబుతావ్ పుష్పని వీలైనంత తొందరలో ఇక్కడికి జేర్చెయ్యాలి."

"సిత్తం. వంటింటి కుందేలు. అదెక్కడికి పోతుందండీ"

నంబూద్రి గదిలోకి నడిచాడు. అక్కడ మంచం. సోఫా లున్నాయి. నంబూద్రి లుంగీ కట్టుకుంటూ ప్రక్కనున్న పోలయ్యతో "పుష్పని పొందితేగాని మనఃశాంతి లేదురా? అది గుర్తువచ్చి నపుడెల్లా కొరడా తగిలినట్లే వుంటోంది" తన ఆశ వెలిబుచ్చాడు.

"అది నాకు వదిలీయండి."

రెండొందలు అందుకుని పోలయ్య బయటికి నడిచాడు. అసలు వ్యక్తికి యెంత ఇవ్వాలో వాడిష్టం. ఈ వేటలో వాడికి పదిహేనేళ్ళ అనుభవం వుంది. చతుర్విధాల ద్వారా స్త్రీలను ఇక్కడి తీసుకువస్తూంటాడు. యేమైన యెదురు దెబ్బలు తగిలితే నంబూద్రి వున్నాడాయె!

"రావే....ఇంత ఆలస్యం అయిందేం" సదాలక్ష్మిని చెయ్యి పుచ్చుకుని లాగేడు.

"మా అయ్య పడుకోడం ఆలీసమైంది" దొంగచాటుగా వచ్చాను అన్న ధ్వనితో అంది.

నంబూద్రి నవ్వుతూ "దొంగ వస్తువే విలువైనది" అని బుగ్గలు నొక్కాడు.

తెల్లవారింది.

నంబూద్రి ఇంటికి బయలుదేరాడు. విష్ణ్వాలయం సందు తిరగబోతుండగా పుష్ప యెదురైంది.

"ఇవాళ అన్నీ శుభాలే నాకు" ఆగుతూ.

"దండాలు బాబుగారూ" అంది వినయంగా. "మీ కోసరం వత్తన్నా."

"యేమిటి సంగతి?"

రామినీడు గొడవ చెప్పుకుంది. "ఆడు నా మొగుడ్ని నాసినం చేసేత్తున్నాడండి నన్ను నిల్వనీయడంలేదు. ఏ చణంలో వచ్చేత్తాడోనని బియ్యంగా వుంది."

"అంతదాకా వచ్చిందా?"

"సిత్తం. నిద్రా నిప్పులూ లేవండి నాకు."

తనదనుకుంటున్న దానిలో రామినీడు వాటా కోరడం సహించరానిదిగావుంది. పుష్ప తనది. రామినీడుకి గట్టిగా బుద్ధి చెప్పాలి.

"వాడి విషయం నేను చూసుకుంటాలే! నిర్భయంగావుండు. ధృవుడ్ని వెధవ్వేషాలు వెయ్యద్దను. నాకోసారి కనపడమను" అన్నాడు ముందుకు దారితీస్తూ.

'పిత్తమంటూ' చేతులు జోడించింది. కొండంత అండ ఆయన.

* * *

కాళింది పొమ్మనగానే ధృవుడి తిమ్మిరి అణిగింది. ఇంటికి సిగ్గుపడుతూ వచ్చాడు. రాత్రి తలుపు తీయమనే ధైర్యంలేకపోయింది. అరుగుమీద కూర్చున్నాడు. ఈ మధ్య మితిమీరి త్రాగుతూండటంవల్ల దగ్గు పట్టుకుంది. ఖంగ్.... ఖంగ్‌మంటూ ఆపుకుందామన్నా సాధ్యం కాలేదు.

పుష్ప నిద్రపోవడంలేదు. భర్త వచ్చాడని తెల్సింది. దీపం వత్తి యెక్కించి తలుపు తీసింది.

ధృవుడు మోకాళ్ళమీద తలపెట్టకుని కూర్చున్నాడు.

పుష్ప గ్రహించింది. ఆవేశాన్ని అదుపుజేసుకుంది. "సీకట్లో

యెందుకు లోనికిరా" సరళంగా పిల్చింది.

ధృవుడు భారంగా లోపలికివచ్చి మంచం యెక్కాడు.

"వన్నం తింటావా....వుంది" అడిగింది.

ధృవుడు వద్దనడంతో పిల్లాడి ప్రక్కన పడుకుంది. భార్య ప్రవర్తన ధృవుడికి ఆశ్చర్యంగా వుంది. తన ప్రవర్తనకి తిట్టి పోస్తుందనుకున్నాడు. అలాగయినా మాట కలిపి తన ప్రవర్తన దిద్దుకున్నట్లు చెబుదామనుకున్నాడు. పుష్ప ఆ అవకాశం ఇవ్వలేదు.

బాధలు పొల్లులాంటివి. యే చిన్న గాలి వీచినా ఎగురుతుంటాయి. ఇద్దరూ చెరో మంచం మీదా పడివున్నా వేర్వేరు కోణాల్లో అంతరంగాలు అంతర్మధనం పొందుతున్నాయి. ఈ దృశ్యం వుండిపోదు. అన్నిటిలాగే తెర వెనక్కిపోతుంది. ఇలాంటప్పుడు తలచుకుంటే అంతా వుదాసీన మనిపిస్తుంది. జీవితంపై వ్యామోహం చచ్చిపోతుంది. వర్తమానం చిత్రాన్ని బోర్లిస్తే భూతకాలం. అది ఎత్తయిన శిఖరంపైని వెలసిన ఒంటరి చెట్టు. అక్కడికి వెళ్ళడం అసంభవం.

ధృవుడు తల యెత్తి చూశాడు. పుష్ప ఒత్తిగిలి పడుకుంది. లోపల మరుగుతున్న విచారానికి ముఖం ఎర్రబడినట్లుంది దీపం కాంతిలో.

వేకువలోనే లేచాడు ధృవుడు. పుష్ప అప్పటికే యింటి ముందు కల్లాపిజల్లి ముగ్గు పెడుతోంది. ఆమె ఏదయినా మాట్లాడుతుందని భావించాడు. పుష్ప మౌనం చూసి బల్లకట్టు పైకి వెళ్ళాడు.

ఇలా ముభావంగా నాలుగు రోజులు గడిచాయి. పుష్ప తనని క్షమిస్తుందన్న ధైర్యం వచ్చింది ధృవుడికి.

వారంపైగా సుఖపడటంవల్ల కష్టంగానే వుంది ధృవుడికి. పైగా మందు. పగలుకూడ నాలిక తిమ్మిరి యెక్కుతోంది. త్రాగుదామంటే డబ్బుల్లేవు. అరువైనా త్రాగుదామని కాళింది ఇంటికి వెళ్లాడు.

"అరువులేదు" అంది.

"అంత నమ్మకం లేదటే. బావయ్యా అంటూ ప్రేమ కురిపించావ్‌గా" అన్నాడు.

"నీ యెదవ ముఖాన్ని సూసికాదురా! రామినీడు నిన్ను వంచడానికి డబ్బులు ఇచ్చాడు. ఆడికి నీ పెళ్ళాంమీద మనసుంది. అది లొంగే రకంకాదని తెల్సుకుని. నిన్ను ఇంటికి తగలెయ్య మన్నాడు. నీ కర్సుకూడ ఎందుకు దండగ."

బిత్తరపోయాడు. బిరువెక్కిన ముఖంతో రోడ్డెక్కాడు. రామినీడు ఇంత విషపు మనిషని తెలీదు. అయినా పుష్ప ముందరే చెప్పింది వాడికి దూరంగా వుండమని. తను పైపై మెరుగులు చూసి మోసపోయాడు. జరిగేదంతా పుష్ప ముందరే పసిగట్టేసిందన్నమాట.

ధృవుడికి పుష్ప తెలివితేటలమీద నమ్మకం, గురి ఏర్పడినాయి.

"నువు సెప్పినట్టే ఇంటానే. జరిగింది జరిగిపోనాది. దానికి నాకూ బాధగా వుంది. రామినీడు యెదవని తెలీదు నాకు. తొందర పడ్డాను" ఇంటికి రాగానే పుష్ప చేతులు పట్టుకున్నాడు గాద్గదికంగా.

ఇది పరివర్తనే అనిపించింది.

ధృవుడు మరింత బాధపడుతూంటే ఆమె ఓదార్చింది. దగ్గర కూర్చుని అన్నం కలిపి అతడి నోట్లో పెట్టింది. "అందరూ మనుసులేకాని, ఆళ్ళలో రాచ్చసులూ వుంటారు. ఎంగిలి మెతుకులు చల్లి లొంగదీసుకుంటారు. నువ్వు సెడిపోతే మన సంసారం సెడిపోతది చెదిరిపోతది. గుర్తుంచుకో."

ఆ రోజునుంచి 'మందు' కూడ సాధ్యమైనంత తక్కువ చేశాడు. సాయంత్రం ఇంటికి పెందరాళే వచ్చేస్తున్నాడు.

పిల్లాడితో కాలక్షేపం చేస్తున్నాడు.

## 16

బల్లకట్టుమీద అదాయం ఇప్పుడు సంసారానికి సరిపోవడం లేదు. ఖర్చులు తగ్గించుకున్నా ఆదాయం తూగడంలేదు. పిల్లాడున్నా ఏ అచ్చటా ముచ్చటా తీర్చుకోలేకపోయినందుకు వారికి బాధగా వుంది. పుష్ప చాపలు, బుట్టలు అల్లసాగింది. వూర్లో అమ్ముడుపోవు. పేరుగూరి సంతకి తీసుకుపోవాలి. సంతలో మంచి ధరవస్తుంది. పుష్ప సంతనుంచి వచ్చేటప్పుడు పిల్లాడికి గుడ్డలూ, బొమ్మలూ

తీసుకువస్తూంటుంది.

ధృవుడికి పిల్లడితోనే లోకం. ఇంటిపట్టునవున్నపుడు ఒక్క-క్షణం వదిలిపెట్టడు. పిల్లాడిపేరు శివుడు.

కాలువ గట్టు మీద వేరే ఇళ్లు లేవు. పుష్ప సంతకి వెళ్ళవల్సి వస్తే శివుడ్ని ఒంటరిగా వదలిపోవాల్సి వస్తోంది. ధృవుడు మధ్య మధ్య వచ్చి చూస్తున్నా తృప్తిగా లేదు. పైగా కాలువ పొంగినపుడు నీళ్ళు గుమ్మాల్లోకి వచ్చేస్తున్నాయి. వర్షాలకి ఇల్లు పాడైపోయింది. తిరిగి విప్పి కట్టాలి.

"మాట్లాడిరా నంబూద్రిగారితో" ధృవుడ్ని హెచ్చరించింది.

ధృవుడు అదిగో ఇదిగో అంటున్నాడు. అతడు నాన్చడం చూపి తనే నంబూద్రిని పోయి కల్సుకుంది. వీధి వరండాలో పోలయ్య తల మర్దనచేస్తున్నాడు నంబూద్రికి.

గేటులోంచే నంబూద్రి దృష్టి పుష్పమీద పడింది. అతడిలో చలనం బయలుదేరింది.

"దండాలయ్యా!" పుష్ప నమస్కరించింది.

"నువ్వు రావడమెందుకే" కబురుపెడితే నేనే వద్దునన్నట్లు చూశాడు నంబూద్రి. "తగినంత పనిలేందే నువ్వు కనపడవనుకో!"

పోలయ్య యజమాన్ని గమనించాడు. కళ్ళు మైకంలో వున్నాయి. "పులి మేకను చూస్తోంది. పంజా ఎత్తడానికి."

"పిత్తం. మీ దయవల్ల ఈడ అమరిపోయాం. మీ నీడలో కాపురం సేత్తన్నాం." అంది పుష్ప కృతజ్ఞతగా. నంబూద్రి ఆమెకి పెన్నిధి. తండ్రి చావుకి అతడు చేసిన సాయం ఆమెలో స్థిరమైన గౌరవాన్ని కలిగించింది అతనిపట్ల.

ఇల్లు బాధ చెప్పింది.

"మా యింటి దగ్గరకి వచ్చేయండే పిల్లా. పిమ్మాద్రి యిశా పట్నం కాపురం యెత్తేశాడు గదా. ఇల్లు ఖాళీగా వుంటన్నాది" అన్నాడు పోలయ్య.

"అలా చెయ్యి బాగుంటుంది. పోలయ్య మంచీ చెడ్డ చూస్తూంటాడు."

"పిత్తం."

లీలావతి దర్శనం చేసుకుని, ఆమె ఆవకాయ ఇస్తే పుచ్చుకుని ఇంటికి బయలుదేరింది పుష్ప.

"నీకూ బుర్రందిరా. పుష్పని ఇంటి ప్రక్కకి రప్పించావు."

"మీ పక్కలోకి రప్పించేస్తానయ్యా. సూడండి."

"తొందరగా జరిగిపోవాల. దాన్ని రోడ్డుమీదే కొరుక్కు తినేయాలనిపిస్తోంది. రోజురోజుకీ దాని అందం ఎక్కువైపోతుందిరా!"

పదిహేనురోజులు గడిచాయి.

ప్రభుత్వం పాలెంలో దోమలు యెక్కువ వున్నాయో, ఈగలు యెక్కువ వున్నాయో తెల్సుకోడానికి ఓ కమిటీని వేసింది. దానికి నంబూద్రిని చెయిర్మన్‌గా వుండమన్నారు. కాని అతడు దూర దృష్టితో దాన్ని రామినీడుకి వేయించాడు. రామినీడు కుర్చీకోసం కష్టాలుపడుతున్నాడు. తనకి అడ్డు తొలగించుకోడానికి పదిరోజులు పట్టింది. వచ్చి బట్టలు విప్పుకుంటూండగానే పోలయ్య వచ్చేశాడు.

"సుదాకరంబాబు వరసేం బాగానేదండీ. నిన్న మా సొరాజ్జెం చెయ్యిలాగేడట. నేను పోయి అడిగితే నీ లెక్కేమిటంటాడు."

"నేను చూస్తాలేరా? నువ్వెళ్ళు." వచ్చింది పోలయ్య కనుక ఆ మాత్రమైన చెప్పాడు. చాల విసుగ్గా, అలసటగా వుంది.

మరో పదిరోజులకి ఆయనేం చూడలేరని పోలయ్యకి తెల్సిపోయింది.

స్వరాజ్యం పోలయ్య ఏకైక సంతానం. కొద్దో గొప్పో చదువుకుంది. గ్రామసేవికగా పనిచేస్తోంది. భార్యపోయినప్పట్నుంచి కూతురిమీదే ప్రాణాలు పెట్టుకుని మసులుతున్నాడు పోలయ్య.

ఈ సారి సుధాకరం స్వరాజ్యం నీళ్ళకోసం కాలువకెళ్ళినపుడు ఆమెని కాలువలోకి త్రోసి, ఆమెని రక్షించే నెపంతో శరీర మంతా తాకి వదిలాడు.

పోలయ్య కుతకుతలాడిపోయాడు.

విశ్వాసంగా సేవచేస్తున్నందుకు తన కూతుర్నే ఇలాచేస్తారా? తను పాలేరుగాడు కాబట్టి లోకువ.

'తన' అనేసరికి పోలయ్యకి నొప్పిపుట్టింది. కర్రేసుకుని సుధా కరం కోసం మిల్లు దగ్గరకి వెళ్ళాడు. సుధాకరం లేడు. నంబూద్రి పంచాయితీ ఆఫీసు దగ్గర కనిపించాడు. చెప్పాడు.

"కుర్రాడు. సరదా పడివుంటాడు. నేను చెప్తాలే."

నలుగురు బిడ్డల తండ్రి కుర్రాడా? ఆ మాట మరొకరు అంటే పోలయ్య చంపేసి వుండేవాడు. అసమర్ధత వెక్కిరించిం ఆవేశాన్ని అణచుకో ప్రయత్నించాడు.

బాహాటంగా ఆయన్ని ఏం చెయ్యలేదు వాడు. కాని తన పరిధిలో ఏం చెయ్యగలడో ఆలోచించాడు.

విరోధంలో అమృతం త్రాగించలేం. స్నేహంమీద విషాన్ని త్రాగించేయవచ్చు. ఈ సూక్తి పోలయ్యకి తెల్సు. తను పూర్తిగా ఆయన సేవలకి అంకితమై వున్నాడు. ఆయన దృష్టిలో తనకో ప్రత్యేక విలువ వుంటుందని సంబరపడుతూ వస్తున్నాడు. నంబూద్రి మాటలు కృంగదీశాయి. తనని డాఫర్‌గానే చూస్తున్నాడు. తన కూతురు కూడ ఎదురుచెప్పకుండా పడుకోవాలి. పోలయ్య తన కోపాన్ని అణచుకున్నాడు. మానసికంగా అతని స్వామిభక్తి ఎగిరి పోయింది.

"ఈ వందా వుంచు .... వాడితో చెప్తాలే" మీటింగ్‌లోకి నంబూద్రి వెళ్ళిపోయాడు.

పోలయ్య శాంతిగా రోడ్డు ఎక్కాడు. "డబ్బుతో నా మంట చల్లారదు బాబూ? పోలయ్య తడఖా చూపిస్తా. నీ వేలితో నీ కన్నే పొడిపిస్తా."

పోలయ్య ఇంటికి బారెడు దూరంలో వుండగానే షష పరుగున వచ్చి "బాబాయ్! సౌరాజ్యం ఏదో మింగినట్టుంది. పిలిచినా మాట్లాడ్డంలేదు" అంది.

పోలయ్య ఒక్క అంగలో ఇంట్లో పడ్డాడు. స్వరాజ్యం మంచంపై పడివుంది. ఎండ్రిన్ వాసన వేస్తోంది. "ఎంతపని చేసి నావే కూతురా" గొల్లుమన్నాడు.

ఈ హడావిడి చూపి భోజనానికి వచ్చిన ధృవుడు వచ్చాడు

అటు. వెంటనే అవధాని కోసం బయలుదేరాడు.

అవధాని సంచీ డాక్టరు. పేదలకి అందుబాటులో వుంటాడు. సైకిల్ మీద వెంటనే వచ్చేశాడు. స్టమక్ వాష్ చేయించాడు. రెండు ఇంజక్షన్లు చేశాడు.

స్వరాజ్యం కోలుకుంది.

"ఇంకేం ప్రమాదం లేదు" అవదాని బయలుదేరుతూ అన్నాడు.

పోలయ్యకి తగని సంతోషంగా వుంది. "నాకు జనమనిచ్చారు పంతులుగోరూ! అదీలేకపోతే నేను బతికేవాడ్నా?" అని వందనోటు ఇచ్చాడు.

"తాగిన వెంటనే గుర్తించడంవల్ల మనకి మాట దక్కిం దనుకో. ఇదంతా పుష్ప చలువ?" అవధాని సైకిల్ ఎక్కాడు.

ప్రమాదం తప్పడంతో ఇరుగు పొరుగు ఇళ్లకిపోయారు. పుష్ప విసనకర్రతో విసురుతూ స్వరాజ్యం మంచంమీద కూర్చుంది.

"నువ్వు కూడు తిని రామ్మా. ఆలీశం అయిపోయింది" అన్నాడు పుష్పతో.

"ఫర్వాలేదులే. సొరాజ్యం లేస్తే ఏ కాపీ అయినా కలిపి ఇచ్చి వెలతాను" అంది.

పోలయ్య అరుగుమీదకి వచ్చి చుట్ట వెలిగించాడు.

పుష్పని మాయజేయడానికీ, నంబూద్రికి అప్పగించడానికే తన ఇంటికి రప్పించుకున్నాడు. కీడు తలపెట్టాడు.

పుష్ప మేలుచేసింది.

నంబూద్రి కీడు చేశాడు.

పోలయ్యకి తల తిరిగిపోయింది. తన ప్రవర్తన సమీక్షించు కుంటే అసహ్యం కల్గింది. పుష్పమీద ఈగ వాలనీయరాదను కున్నాడు. పుష్పని నంబూద్రికి అందనీయకుండా తను కాపాడితే, తన కసి తీరుతుంది నంబూద్రిపట్ల. పుష్పచేసిన సాయానికి కృతజ్ఞత గానూ వుంటుంది.

నాలుగింటికి స్వరాజ్యం లేచింది. పుష్ప కాఫీకోసం పొయ్యి

వెలిగించడానికి లేచింది.

పోలయ్య వచ్చి ఆమె మంచంపై కూర్చున్నాడు. "సాహసం ఎందుకు చేసేవే అమ్మడూ? ఆ ఎదవకి నాను బుద్ధిసెప్పలేనా? నౌకరీ మానేసి ఇంటికాడే వుండు. కట్టం సేయవల్సిన అవసరం నీకేం వుంది."

పోలయ్య తన సంపాదన తాగి తందానాలాడలేదు. మూడెక రాల పొలం కొన్నాడు. ఇల్లరికం సంబంధం చెయ్యాలని కూతురుకి.

స్వరాజ్యం సున్నితమైన మనిషి. అలజడి భరించలేక ఆత్మ హత్యకి దారితీసింది.

"కాఫీ తీస్కో సెల్లీ" పుష్ప గ్లాసు అందించింది.

# 17

కాలవమీద మరో వంతెన కోసం ప్రజలు ఆందోళన చేస్తూ వచ్చారు ఇప్పటిదాకా. రామినీడు హయంలో అలాంటివేం పట్టించుకునేవాడు కాదు. షణ్ముగం పార్టీ రాగానే మరో వంతెనకి అనుమతిచ్చారు.

అందరూ సంతోషిస్తే ధృవుడు విచారించాడు బ్రతుకుతెరువు పోతుందని. తన భయం నంబూద్రితో చెప్పుకున్నాడు.

వంతెన పని ఆలస్యం కాలేదు. కంట్రాక్టరుకి మరో పెద్ద పని ఎదర వుండటంవల్ల వంతెన ఇరవై రోజుల్లో కట్టేశాడు. అధికారికంగా వంతెన ప్రారంభమవలేదు గాని ప్రజల రాకపోకలు జరిగిపోతున్నాయి.

బల్లకట్టు నడిపేవాడి అవసరం ఇక లేదు.

నంబూద్రి వారంనుంచి వూళ్ళోలేదు. ఏ రోజు కారోజు వస్తాడేమోనని ధృవుడు ఇంటిచుట్టూ తిరుగుతున్నాడు.

పుష్ప అక్కడికీ జాగ్రత్తగా కాలక్షేపం చేస్తోంది. బుట్టల అమ్మకం డబ్బే సంసారానికి శరణ్యమైంది. కాని అది స్వల్పం.

ధృవుడు చొరవతో ఏదీ చెయ్యలేదు. నంబూద్రి వచ్చాక చూసుకుందామనే ఆలోచనలో వున్నాడు. అది రోజురోజుకి వెనక్కిపోతోంది.

"కామందుగోరు వచ్చేదాకా కూకోవడమెందుకు. ఏదో అందాకా సూసుకోరాదూ" పుష్ప హెచ్చరికచేసింది.

పెళ్లాం అలా చెప్పడం ఏదో న్యూనతగా వుంది. డబ్బు చేతిలో ఆడకపోవడంవల్ల ధృవుడికి పిచ్చిగా వుంది. "ఇదేమన్నా పట్నమా ఏదో సేసుకోడానికి! అయినా కంగారుపడితే ఏం సేత్తాం. ఆయన్ని రానీ."

రెండు రోజులనుంచి జ్వరం పుష్పకి. అయినా బుట్టలు అల్లుతూనే వుంది. యివాళ సంత. వెళ్ళడానికి ఆమెకి ఓపిక లేదు.

"నేను పోయి వస్తాలే!" అంటూ ధృవుడు సంతకి తయారయ్యాడు.

ఏవి ఎంతకి అమ్మాలో చెప్పింది.

"నీకంటె బాగానే అమ్ముకొస్తాను చూడు."

"రెండు గంటలకి సరుకు తీసుకుని సంతకి బయలుదేరాడు. రెండు మైళ్ళు సంత. పుష్ప చెప్పిన దానికంటె ఎక్కువ అమ్మి మిగతాది 'సారా' తాగెయ్యాలని ప్లాన్ వేసుకున్నాడు. సారా త్రాగి చాలరోజులైంది.

సంత అప్పటికే కిటకిటలాడుతోంది. సంత పన్ను కట్టి ఒక చోట దుకాణం వేశాడు. ఇంతలో కుండల వ్యాపారొచ్చి "ఇది నా చోటు....మీ దుకాణాలు చివర అక్కడికిపో" అన్నాడు. ప్రక్కవాళ్ళు కూడ చెప్పడంతో ధృవుడు సర్దుకుని బయలుదేరాడు.

నాలుగయినా ఏం అమ్మలేదు. ధృవుడి దగ్గర రేటు ఎక్కువ.

చీకటీపడుతూండగా ఒక అసామీ వచ్చి "టోకున అన్నీ ఎలా ఇస్తావు?" అని అడిగాడు. అతడింట్లో పెళ్లి.

"ఇరవై రెండు" అన్నాడు ధృవుడు.

ఇరవైకి బేరం కుదిరిపోయింది. ధృవుడు ఆనందానికి హద్దు లేదు. పుష్ప చెప్పిన దానికంటె ఎనిమిది ఎక్కువ.

సారాకొట్టు దగ్గరకెళ్ళి సీసా అడిగాడు. నోటు యిచ్చి.

"నోటు మారదయ్యా. పిరా వాలికింది. మరోటి ఇయ్య" అన్నాడు వాడు.

ధృవుడి దగ్గర మరోటి ఎక్కడ వుంది? మరో కొట్టులో ప్రయత్నించాడు. మారలేదు. ఆ నోటు సంతలో ఎక్కడా చలామణి కాలేదు. ఇచ్చినవాడి కోసం చూశాడు. ఎక్కడుంటాడు.

సంతనుంచి సరుకులు తెస్తాడని వంట చెయ్యొచ్చని ఎదురు చూస్తోంది పుష్ప. డీలాగా వస్తున్న ధృవుడ్ని చూసి హతాశురాలైంది.

జరిగింది తెల్సి "అంత గుడ్డిగా ఎలా పుచ్చుకున్నావ్. ఆ మాత్రం తెలివిలేదా?" గయ్‌మంది.

"ఇలాంటివి బేంకుకాడ మారతాయని మనవాళ్ళయ్య సెప్పాడు. గొల్లుని యెదవ యేడుపు ఏడవక!" ధృవుడు కసురుకుని మంచంపై కూర్చున్నాడు. నడక, త్రాగకపోవడం వాడి మతి పోగొట్టేశాయి.

పుష్ప గుమ్మంలోంచి మంచం దగ్గరకి వచ్చింది వేగిరం. "రేపు పాయసం తింటామని ఈ రోజు పస్తులుండగలమా? ఓపిక లేకపోయినా కట్టపడి సేసానా? పలితం యేంటి? ఈ రేతిరి పత్తెం సెయ్యమని పంతులు బాబు సెప్పాడు. ఇంట్లో మెతుకులేవి? శివుడు పాలపీక లేనిదే పాలు నోట పెడుతున్నాడా? మనం తొంగోగలం. అడూరుకుంటాడా! చేతకాని బతుకాయె!"

చవటగా జమ కట్టేయడంతో ధృవుడిలో మగతనం విజృంభించింది. పుష్పని ముందుకు త్రోశాడు. కొప్పు పుచ్చుకుని లాగి కొట్టసాగేడు.

పుష్ప కేకలు పెట్టింది.

స్వరాజ్యం పరిగెత్తుకొచ్చింది. ఆమెని చూడగానే ధృవుడు తగ్గాడు.

"పెళ్ళాన్ని కొట్టడమే మన ఈరత్యం....సిగ్గులేదా? రోగిష్టిదయినా సూడకుండా సేయి చేసుకుంటావా?" స్వరాజ్యం అడిగింది కోపంగా.

"దాని వాగుడు బాగుందీ!"

జరిగింది పుష్ప చెప్పబోయింది. ధృవుడు తిరిగి దూకుడుగా మీదకి వచ్చి "నిన్ను సూత్తే కంపరం యెత్తిపోతున్నదే....ఇంటికి

రాగానే ఏడుపు ప్రారంభం దివసాయం ముండా. నోరెత్తావా ఈ రోజు నరికేశానే" అన్నాడు పెద్ద గొంతుకతో.

"అక్కా....రా....బావయ్యకేదో పిచ్చి పట్టింది" స్వరాజ్యం ఆమెని తన ఇంట్లోకి తీసుకెళ్ళింది.

స్వరాజ్యం శివుడికి పాలు కలిపి ఇచ్చింది. జరిగింది తేరుకుంటూ చెప్పింది పుష్ప.

"బావయ్య సంతనుంచి వచ్చేదాకా సూడాలా? బియ్యం నన్న దగరాదూ! నాకాడ కూడ సిగ్గే" స్వరాజ్యం నొచ్చుకుంది.

పుష్ప మాట్లాడలేదు.

స్వరాజ్యం ఇద్దరికి కంచాలు పెట్టింది. పుష్ప ముఖమాట పడింది.

"ఆడేదో ఆకలి కోపంమీద కొట్టాడు కాని, అడు తిన కుండా నేనేం తిననే."

"ముందర తిను. బావయ్యకి పట్టుకెళుదువుగాని. ఆడు సంపినా నీకు ఆడిమీద ధ్యాసపోదు."

వీళ్ళ భోజనాలు అవుతుండగా పోలయ్య వచ్చాడు.

"నంబూదిరిగోరు వచ్చారా బాబయ్యా!" ఆశగా పుష్ప అడి గింది. ఆయన వస్తేకాని తమకి దారే దొరకదని పుష్ప తలంపు.

"లేదే పిల్లా. కార్డు వచ్చిందీయేళ. ఇంకా పనులు అ లేదంట. ఆలీశం అవుతుందట ఆయన రాడానికి."

పుష్ప హతాశురాలైంది.

పోలయ్య కుండలోని వేడినీళ్ళు పోసుకుని అన్నానికి వచ్చాడు

"ధృవుడు యిపుడేం చేస్తన్నాడే! బల్లకట్టు తిరగడంలేదు గందా!"

"దానిగురించే బెంగంతా! బాబుగారు లేరామె!"

పోలయ్య ఆలోచనలోపడి కాస్సేపు వూరుకుని "అమ వచ్చేదాకా అమావాశ ఆగుతుందా? మనమే ఏదో చేసుకోవాల. గమ నేలు ఆరోగ్గెం బాగాలేక చేపల వేటకి వెళ్ళలేక పోతున్నాడు ధృవుడ్ని వాడితో వేటకి వెళ్ళమను. గమానేలుతో నెను సెబుతానే వచ్చింది చెరి సగం తీసుకోవచ్చు. ధృవుడికి అలవాటయ్యాక

పడవ బేరం చేసుకోవచ్చు. ఏమంటావు?"

"బాగానే వుంది. ఆడితో సెబుతాను. ఏవంటాడో."

"ఓసారి ఆడ్ని రమ్మను. కూడుతిని గమానేలు కాడకి పోతాం."

ధృవుడు పౌరుషంగా మంచంమీద దొర్లుతున్నాడు. ఒకసారి లేచి ఇల్లంతా చూశాడు. తినే వస్తువేం కనిపించలేదు. ఇంతలో పుష్ప అన్నం తీసుకురావడంతో కరిగిపోయాడు. గమానేలు విషయం చెప్పడంతో నోరు తిరగలేదు. తన తొందరపాటుని కళ్ళతోనే వ్యక్తం చేశాడు, నిట్టూర్పు విడిచి.

"మన పెతాపం నామీదేగా....ముందర ఎన్లెరా" అంది పుష్ప నవ్వుతూ.

గమానేలు ఒప్పుకున్నాడు. అతడికి యాభై దాటాయి. పక్షవాతం పడి లేచాడు. పెళ్ళాంపోయింది. ఈ మధ్యనే కొడుకు దెబ్బలాడి మామ ఇంటికి కోటిపల్లి పోయాడు. గమానేలు పొట్టకోసం తిప్పలుపడక తప్పలేదు.

గమానేలు పడవమీద కూర్చుని సలహాలు మాత్రం ఇస్తాడు. పడవ ఏ గాలిమీద ఎలా నడపాలో, ఎక్కడ చేపలు దొరుకుతాయో వల విసరడంలోని మెలకువలేమిటో చెప్పసాగాడు. మొదటి రోజు రెండు బుట్టలనిండుగా పడ్డాయి చేపలు.

"నీ చెయ్యి మంచిదే. రా బుల్లోడా? గంగమ్మ తల్లికి మవ్వంటే అభిమానమే!" అన్నాడు ప్రశంసగా గమానేలు, రేవులో ఆగాక.

ధృవుడు సంతోషించాడు, ఒడ్డున కూర్చుని చెరి సగం వాటా పంచుకున్నారు. ధృవుడు బుట్టతో ఇంటికి బయలుదేరాడు. ఇంటికి చేరేలోగా బయటవాళ్ళకి అమ్మి అయిదు రూపాయలు సంపాదించాడు.

మిగతా వాటిని సంతకి పట్టుకెళ్ళింది పుష్ప. ఇరవై ఆరు రూపాయలు వచ్చాయి. ఇంటికి సరిపోయే సరుకులు కొంది సంతలో.

కష్టపడితే ఫలితముంటుందనిపించింది ఇద్దరికీ.

## 18

"దగ్గరకి వచ్చాక చూశాను. ముసలిది, అయిదేళ్ళ కుర్రాడు రోడ్డుకి అడ్డుపోతున్నారు. బ్రేకులు వేయడానికి అవకాశం లేదు. ఇటువైపున వరుసగా తాటితోపు రెండో ప్రక్క ఏరు? ఏంచేయాలి?" ధృవుడు కాసేపు ఆపాడు.

చింతడు, మనవాళ్ళయ్య, బొండాం అప్పన్న ముఖాలు ఇంత చేసుకుని వింటున్నారు. ధృవుడు ఆగడం చూపి "ఏం చేసినావ్?" అన్నారు.

రెండ్రోజులనుంచి వాన కురుస్తోంది. తుఫాన్‌గా మార వచ్చని ఎవరూ గోదావరిమీదకు వేటకు పోవడంలేదు. ధృవుడీనాడు తన సాటివాళ్ళలో హీరో. వాళ్ల ఆ ప్రాంతందాటి ఎక్కడికీ పోలేదు ధృవుడు లారీలమీద నాలుగూళ్ళూ చుట్టివచ్చాడు కనుక, తను చూసిన వింతలు కథలుగా రంగరించి మిత్రులకి చెప్పసాగాడు.

"మనుషుల్ని సంపుతామా మరి? ఏటిలోకి కోసేసి ఆపాను.'

"లారీబండి తలక్రిందులై పోలేదురా?" మనవాళ్ళయ ఆరినచుట్ట వెలిగించుకుంటూ ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"రోడ్డు ఎత్తుగా లేదు ఏటవాలుగా వుంది. అదీ మనదృష్టం."

"మేమయితే ఆళ్లని సంపేసేవాళ్ళం" బొండాం అప్పన్న నవ్వాడు.

"నీ ముఖానికి లారీ ఎక్కడం కూడానట్రా" మనవాళ్ళయ వేళాకోళం చేశాడు.

పొద్దు పదిగంటలయింది. పుష్పకి వంట [illegible] తెమలలేదు శివుడు అన్నం కోసం రాగంతీస్తున్నాడపుడే.

"ఏపుడు ఏయించి పెట్టేత్తానాగు. అందాకా మీ అయ్యదగ్గ కూర్చో" అంది పుష్ప బాండీపొయ్యిమీదపెట్టి.

నూనె సీసాలో నూనెలేదు.

"ఇదిగో....ఓ అరపంపు నూనె తేవాలి....ఆ కబుర్లు తరవా చెప్పుకోవచ్చు. వాటికి పొద్దుందాయె!" పుష్ప సీసాతో వాళ్ళ మధ వచ్చింది.

ధృవుడు రూపాయి నోటు ఇచ్చి "అప్పన్నా... పరుగున పోయి నూనె పోయించుకురా!" పురమాయించాడు.

"నేను వచ్చేదాకా కొత్తవి సెప్పక" అప్పన్న లేచి పరుగెత్తాడు.

"జాగ్రత్త బాబు. నువ్వు పడితే తొందరగా లేవలేవు. ఈ పోకిరీ కబుర్లకేంలే" పుష్ప రోడ్డుమీదకి చూస్తూ అంది.

"మా అప్ప ఏమంటోందో ఇన్నావా బావయ్యా?" చింతడు అన్నాడు.

"అదేమన్నా వాగుతుందిరా. మన ప్రతిభ దానికేం తెల్సు. అత్తరు కుక్కకి తెలుస్తుందిరా?" పెళ్ళాన్ని ఓరగా చూసి కవ్వించాడు.

పుష్ప పని తొందరలో వుంది. వంటింటికి వెళుతూ "శివుడ్ని కూడ మీకాడ కూకోపెట్టుకోరాదూ! వంట తెమలనీయడం లేదు." చెప్పింది.

రోజులు గడుస్తున్నాయి సామాన్యంగా. ధృవుడిది పెద్ద చెయ్యే. డబ్బు చేతిలో వుంటే ఆగదు! రేపు కోసం కొంచెం జాగ్రత్తపడాలని అనుభవం నేర్పింది కనుక ఇంటి పెత్తనం పుష్పకే వదిలేశాడు. ఖర్చుల కోసం తనే అడుగుతాడు.

మనసు చెప్పినట్లు వింటుంది శరీరం. దాని ఆజ్ఞలు కాదనలేదు. మానసికంగా శాంతివుంటే ఎలాంటి ఒడిదుడుకు పరిస్థితులనైనా జయించవచ్చును.

నవ్వూ ఏడుపూ తప్పవు మనిషికి. ఏదయిన ఒక పాఠం నేర్పి వెళుతుంది మనిషి మిగిలేది అనుభవమే. అదే వ్యక్తిత్వాలకి సుస్థిరత కలుగజేస్తుంది.

గమానేలు పూర్తిగా జబ్బుపడ్డాడు.

"ధ్రువా! ఇంక నేను చెయ్యలేనురా. వేటకి నువ్వు పోతూండు. నీ కేది తోస్తే అది ఇవ్వు" అన్నాడు గమానేలు.

"ఎంతివ్వాలో చెప్పయ్యా."

"మన సంపాదన రోజూ ఒకలాగుంటుందిరా? నీకు తోచింది

ఇవ్వ. నేను కాదంటానా!"

ధృవుడు డబ్బు చెల్లించడంతో ఆగిపోలేదు. గమానేలుకి మందూ మాకూ తెచ్చేవాడు. అన్నంకూడ పట్టుకెళ్ళేవాడు.

గమానేలు రోగం ముదిరిపోయింది. కొడుకుని చూడాలని వుందని ఏడ్చాడు. ధృవుడు వుత్తరం రాశాడు.

రంగప్ప రాలేదు.

"ధృవా! లోకం ఎలా అయిపోయిందో సూద్రా! డబ్బియ లేదని ఆడికి ఆడి పెళ్లానికి కోపం. యిత్తె ఈ పాటికి తగలేశ్రేదు. అయినా నా తరవాత ఆడిదే కవరా, వెసనాలకి తగలేత్తె ఆనక ఎవరు సూస్తార్రా! రంగడికి వివేకంవున్నా ఆ మా తల్లి సాగనీయదు!" గమానేలు వాపోయాడు.

గమానేలు ఆఖరి దశలో వున్నాడు. ఇలాంటప్పుడు కూడ రంగప్ప కక్ష పెంచుకోవం ధృవుడికి భావ్యంగా తోచలేదు. ఇటు గమానేలు కొడుకు ధ్యాసలో పడివున్నాడు.

వుత్తరం రాసినా వుపయోగం లేదని ధృవుడు కోటిపల్లి బయలుదేరి వెళ్ళాడు. రంగప్పని కల్సుకున్నాడు.

"నీ వుత్తరం అందలేదు. లేకుంటే రానా" అన్నాడు.

"శానా రోజులుగ మంచానే వున్నాడు. రోజు నీ కోసమే కలవరింత."

"సరేలే రేపు బయలుదేరి వత్తాను?"

"రేతిరికి పోవచ్చును గదా" అన్నాడు ధృవుడు అక్కడ గమానేలు పరిస్థితి ఎలావుంటుందోనని కంగారుపడుతూ.

"ఇంటికాడ మా మావలేడు. ఆయనతో సెప్పందే ఎలా రాను? నువ్వెల్లిపో. ఫస్టు బస్సుకి వచ్చేత్తా."

వాడి భార్యకూడ అదే అంది.

ధృవుడు రాత్రికి రాత్రి ఇంటికి వచ్చాడు. గమానేలు ఆశగా అడిగాడు.

"వచ్చాడ్రా!"

"మాపటికి వత్తాడు."

గమానేలు నమ్మలేదు. ఆశ తెంచుకున్నాడు. ధృవుడు ఇంటి కెళ్ళి భోజనంచేసి వచ్చాక గమానేలు దగ్గరకి పిలిచాడు. "నువ్వే నా కొడుకువిరా! ఆ ఎదవ రాకపోయినా నువ్వే నా బూడిదసెయ్యి. పడవ నువ్వుంచేసో్క. ఆ ఆస్తికోసం వాడు, మావ నేను చచ్చాక ఎలా గయినా వస్తారు."

గమానేలు తెల్లవారు ఝామున పోయాడు. పదకొండు గంటలకి రంగప్ప, వాడి మావ, అత్త, భార్య దిగేరు.

"రాతిరి వస్తే పివరి సూపయినా దక్కునుగదా. నీ కోసరం కలవరించి పోయాడు ముసిలాడు" ధృవుడు అన్నాడు రంగప్పతో.

"పోన్లెద్దూ .... ఇప్పుడు నట్టమేముంది?" నిర్లక్ష్యంగా అన్నాడు.

తండ్రి పోవడం రంగప్పకి శుభంలా వుంది. తండ్రి పనికి రాకపోయినా అతడి ఆస్తి యావత్తూ నెల రోజుల్లో రూపాయిల్లో మార్చుకుని ప్రయాణమైపోయాడు.

"ఆడు మనిషి కాదు...." ధృవుడు అసహ్యపడ్డాడు.

దిన చక్రం ఋతు వలయంలో తిరుగుతోంది. సొంత పడవ వుండటంవల్ల ధృవుడికి సుఖంగా వుంది. ఆర్థికంగా అంత ఇబ్బంది పడనక్కర్లేకపోతోంది. వృత్తిపై కసి పెరిగింది.

ఒకనాడుదయం వేటనుంచి తిరిగి వస్తూండగా స్వరాజ్యం యింటి దాపున యెదురైంది నవ్వుతూ. "ఆడపిల్ల బావయ్యా ... యింకా యెక్కువగా సంపాదించాలీడనుంచి."

"పురుడొచ్చేసిందా?"

"ఓ గంటవుతాది. నీళ్ళు పోసేశాం...."

బుట్ట అరుగుమీద పడేసి ధృవుడు పురిటి యింట్లోకి పరు గెత్తాడు. పురిటిల్లు సాంబ్రాణి వాసనతో గుప్పుమంటోంది.

పుష్ప ప్రక్కన పొత్తిళ్ళలో పసిగుడ్డు. ఈ లోకంలో వచ్చి పడినందుకు ఏడుస్తోంది.

"నువ్విలాగా యేటా ఒకర్ని కనేత్తే నా పని దివాళాయే!" ధృవుడు నవ్వాడు మంచం ఎదురుగా నిలబడి బిడ్డని చూస్తూ.

"నువ్వు నా కాడకి రాకుంటే సరి" కవ్వింపుగా నవ్వింది.

"అమ్మో."

"అవ్వా కావాలి బువ్వా కావాలంటే ఎలాగ?"

"పాప నీ పోలికే."

"మన యింటి లచ్చిమిది."

శివుడు గుమ్మంలో బిస్కట్టు తింటూ నించున్నాడు.

"సెల్లిని సూసావంట్రా?" ధృవుడు కొడుకుని తీసుకొచ్చి అన్నాడు.

"ఆ వెర్రి ఎదవ యిందాకటినుంచి ఏడుపే. సౌరాజ్యం వూరుకోబెట్ట లేకపోయింది. నేను మంచం యెక్కడం చూపి దడుసుకున్నాడు.'

ఇద్దరి ముఖాలపైనా నవ్వు కెరటాల వరద.

నాలుగేళ్ళు గడిచాయి........

# 19

"నోర్మూసేయ్....వాగినావంటే సంపేత్తాను. కోపం వచ్చినాదంటే నేను మడిసిని కాను. రాచ్చసుడ్ని" ధృవుడు మరోసారి పుష్పని తన్ని, యింటినుంచి బయటకి వచ్చాడు.

వానాకాలం సూరీడు బంగారంలా మెరుస్తున్నాడు.

ధృవుడు చిక్కుడిపాదు మీదున్న వల భుజాన కేసుకున్నాడు. వల చల్లగా తగిలింది. యింటిముందు కంచెకున్న తడిక తీసి పుష్ప ఏంచేస్తోందనో వెనక్కి తిరిగాడు.

పుష్ప గుమ్మం ముందు చాపలో బోర్లా పడుకుని వుంది. కాళ్ళు పైకి వూపుతోంది. ముఖం గడపమీద వుంది. కన్నీరు కాటుకని ముఖమంతా అలికింది. రోషంగా చూస్తోంది. ధృవుడు వెనక్కి తిరిగి మరో నాలుగు వేద్దామనుకుని, విరమించి రోడ్డెక్కాడు. పొద్దంతా తగవుకి సరిపోయేలావుంది.

మధ్యాన్న సమయంలో పల్లెపాలెం నిశ్శబ్దంగావుంది. కుక్కలు మొరుగుతూ పరుగులెత్తుతున్నాయి. అక్కడక్కడ ముసలమ్మలు చాపలో చేపలు యెండబెట్టుకుని కాపలా కూర్చున్నారు. ఒకరిద్దరు

ధృవుడ్ని పల్కరించారు. ధృవుడు మాట్లాడలేదు.

పేరిగాడి పెళ్ళాం యేటిగట్టుమీద యెదురై "పుష్ప సంతకి రావేటి?" నెత్తిమీద చేపల బుట్ట బరువు సర్దుకుంటూ అడిగింది.

"పోయి అడుగు." ధృవుడు వంతెన యెక్కి యేటి మొగ రోడ్డు పట్టాడు. పడవల రేవులోకి వచ్చేసరికి విసుగు చిరాకు మరింత యెక్కువైనాయి.

పడవల రేవు పెళ్ళివారిల్లులా సందడిగా వుంది. గట్టున రెండు బస్సులు బారులు తీరిన సైనికుల్లా నించున్నాయి. వాటిలో యెక్కడానికి జనం యుద్ధంచేస్తున్నారు. ప్రక్కనే వున్న శ్రీ గంగాభవానీ కాఫీ విలాస్‌లో రేడియో యెల్లారీశ్వరి పాట బిగ్గరగా వినిపిస్తోంది. గోదావరిలో ప్రయాణీకుల లాంచీ హోరుపెడుతోంది.

ధృవుడు ఒడ్డుదాకా వెళ్ళి తన పడవలోకి వల విసిరాడు. అది తప్పి నీళ్ళలో పడింది. ప్రక్కన గుర్రయ్య యిసుక పడవవుంది. గుర్రయ్య పైకి వస్తూంటే "నా వల పడవలో వేయిరా!" అని కేక పెట్టాడు.

ధృవుడు హోటల్ దగ్గరకి వచ్చాడు. బస్సులు వెళ్ళి పోయాయి. మిగిలిన ప్రయాణీకులతో జట్కావాళ్ళ బేరాలు సాగిస్తున్నారు.

ధృవుడు రెండు చుట్టలు కొన్నాడు. ఓదాన్ని వెలిగించి నీడలో నించున్నాడు. పొగాకు మంచిది కాదేమో. పొగ ధారాళంగా రావడం లేదు.

"ఏరా అల్లుడా యింకా రావేంటి?" దైవసాయం గోదావరి పైకిపోతూ కేకేసాడు.

"నువ్వెళ్ళు. వత్తాలే" ధృవుడికి కదలాలనిపించడం లేదు. మనస్సు మధ్యాన్నం జరిగిన గొడవమీదవుంది.

వేటకి పోయినప్పుడల్లా యిబ్బడిగా చేపలు తేవడంలేదని పుష్ప ఏడుపు. తను ఖాళీగా తొంగుంటున్నాడా? రెక్కలు యిరుసుకోవడంలేదా? నిత్యేం చేపలు గంపలతో పడితే పల్లెకారులు మేడలు ఎప్పుడో కట్టేవారు. పుష్ప అసలు ఆశ మనిషి. బుట్టలతో

కొరమీనులు పట్టుకెళితే సోకు చేసుకుని ఆటిని సంతకి తీసుకెళ్తాది.

ధృవుడు పళ్ళు కొరుకుతూ హోటల్లోకి నడిచాడు. అన్నం తినకపోవడంతో ఆకలివేస్తోంది. రొట్టె తిని టీ త్రాగాడు.

"ఏడున్నరయింద" కౌంటర్‌లోని నర్సింహులుతో చెప్పాడు.

"డబ్బులు పడేయరా! శానా యిబ్బందిగా వుంది."

"అమవాస యెల్లనీ."

ధృవుడు నీళ్ళలోకి వచ్చాడు. తెరచాప యెత్తి తెడ్డు వేశాడు. పడమర గాలి తిరిగింది. పడవ వదిలిన బాణంలాపోతోంది. గోదావరి యెగిసిపడే కెరటాలతో సంగీతం వినిపిస్తోంది.

ధృవుడు వలవేస్తున్నాడు.

చేపలు అంతగా పడటంలేదు.

పొద్దు తిరిగేసరికి మూడు మైళ్ళు యెదరకిపోయాడు. సగం బుట్ట నిండింది. ఆ మాత్రమైన నిండినందుకు సంబరపడ్డాడు. పొద్దుటిలా ఖాళీగా పోనక్కరలేదు. చేపలు తేనందుకేగదా అది పోట్లాడత.

పడమర సూరీడు కెరటాలమీద వసంతం చిమ్ముతున్నాడు. సంధ్య వెలుగులో కెరటాలు పాతవెండిలా మెరుస్తున్నాయి.

తీరంమీద వ్యాపించిన కొబ్బరి తోపులోనుంచి చీకటి దూకడానికి సిద్ధంగావుంది. ధృవుడు పడవకట్టి, లంకలోకి వెళ్ళి రెండు దోసకాయలు తెంపుకొని కరకర నమిలేశాడు. వుప్పగావున్న నోటి నిండా నీళ్ళు త్రాగేశాడు. ఆకలి శాంతించింది.

చిరుచీకటిలో పడవ బయలుదేరింది. నిశ్శబ్దమైన నదీతీరంపై ఆకాశంలోని చుక్కలు చేరదేసి కళ్ళనుచేసి చూస్తున్నాయి.

ఇంతలో దగ్గరలో ఎండిన చెట్టు విరిగిపడుతున్న శబ్దం వినిపించింది. ధృవుడు చీకట్లో అటుయిటు చూశాడు తెడ్డువేస్తూ.

కేకలు.

దగ్గరలో ఏదో పడవ తలక్రిందులవుతోంది. రెండు కంఠాలు అస్పష్టంగా అరుస్తున్నాయి. "ఎవరది?" ధృవుడు పడవ వేగం పెంచి కేకేశాడు.

"రచ్చించంద్రోయ్!" పెద్ద కేక.

ధృవుడు నీళ్ళలోకి దుమికాడు. మునిగిపోయిన పడవ వికృతంగా శబ్దించేస్తోంది. కేక వినిపించే దిక్కుగా ఈదాడు. అవతల వ్యక్తి ప్రాణభయంతో కేకలు పిచ్చిగా వేస్తున్నాడు.

ఓ కర్రదుంగ పట్టుకుని కొన ప్రాణంగా వున్నాడు. కెరటాలు ఏ క్షణమైనా అతడ్ని లాగివేయవచ్చు! ఇది ఆఖరి సమయమని అతడికి తెల్సిపోయింది. భయంతో నోరు బిగిసిపోతున్నా బలవంతంగా అరుస్తున్నాడు.

అలాంటి సన్నివేశంలో ధృవుడు చేయి అందిచ్చాడు. ఆ వ్యక్తిని పట్టుకుని తన పడవకేసి ఈదాడు. అప్పుడే తన పడవ బారెడు దూరంలోకి జరిగిపోయింది అలల తాకిడికి. ఆ వ్యక్తిని పడవలోకి త్రోశాడు. ఆ వ్యక్తి ఇంకా నీళ్ళలో వున్నట్లే అరుస్తున్నాడు.

"ఏం భయం జేరగిల్లి కూకోండి....యింకా మునిగిపోయిన వాళ్ళెవరయినా వున్నారా?" ధృవుడు అడిగాడు.

"లేరు. పడవ్వాడు ముందరే ఈదుకుంటూ పోయాడు."

ధృవుడు ఆ కంఠస్వరం పోల్చుకున్నాడు. ఎవరో కాదు. నంబూద్రి. "మీరా అయ్యా....నేను ధృవుడ్ని" అని చెప్పాడు.

"నువ్వట్రా సమయానికి వచ్చి ప్రాణం కాపాడేవు." తనని రక్షించింది ధృవుడని తెలియగానే నంబూద్రి ఆనందం అపరిమితం.

"గోరం ఎలా జరిగినాదండీ!"

"గేదెని కొందామని నేను, పోలయ్య అవతలవైపుకి వెళ్లాం. గేదె నచ్చలేదు. పోలయ్య మరోచోట వుందని చూసి వస్తానన్నాడు. నాకు పనుండి రేవుకి వచ్చేశాను. ఒక కుర్రాడి పడవవుంది. 'కుర్రాడివి నడపగలవురా?' అన్నాను కూడ. ఏం భయం లేదన్నాడు. మధ్యలోకి వచ్చేసరికి తెరచాప ఒరిగిపోయింది....దాంతో ఆ కంగారులో తెడ్డు వదిలేశాడు. పడవ ఒరిగిపోవడంతో వాడు దూకేశాడు."

చిక్కగా చీకటిపడింది. చీకటిలో నదీప్రవాహం ఏనుగులు

నీళ్ళు త్రాగుతున్నట్లు చప్పుడు చేస్తోంది. వూళ్ళోని దీపాలు గమ్యాన్ని చూపిస్తున్నాయి.

నంబూద్రి ఒడ్డుకి చేరుకున్నా పదేపదే ధృవుడ్ని పొగడ సాగేడు. ఆ సమయంలో వాడే రాకుంటే....తర్వాత ఆయన ఊహించలేకపోతున్నాడు.

తడిబట్టలతో నంబూద్రిని చూసి రేవులోని వాళ్ళందరూ అడిగారు. నంబూద్రి ప్రమాదాన్ని వర్ణించి చెప్పాడు. ధృవుడి సాయాన్ని ఘనంగా చెప్పాడు.

ఒక మంచి పని చేసినందుకు ధృవుడికి గర్వంగావుంది.

నంబూద్రి తెలుసున్న వారితో యింటికి బయలుదేరాడు. "ధృవా! నాతో రా" అన్నాడు.

నంబూద్రి ప్రమాద వార్త యింటికి ముందరేచేరింది. సందు చివర కొడుకులు, కోడళ్ళు, మనవలు భార్య ఆందోళనగా ఎదురైనారు.

"ఎంత ప్రమాదం తప్పిందండీ!" లీలావతి ఆయన్ని పట్టుకుని చిన్న రాగం తీసింది.

"ఇది ఏడవవల్సిన సమయమటే వెర్రి ముఖమా? ధృవుడు దేవుడిలా వచ్చి కాపాడేడు."

అందరి దృష్టి ధృవుడిమీద పడింది. ఒక్కొక్కరే అభినందించారు. ప్రమాదం ఎలా జరిగిందో ధృవుడు అనేకసార్లు చెప్పవల్సి వచ్చింది.

ఎనిమిది దాటింది. నంబూద్రి సూర్యంని పిలిచి ఏదో చెప్పాడు. తండ్రి పొరపాటు చెప్పాడని రెట్టించి అడిగాడు. నంబూద్రి మరల అలాగే చెప్పాడు.

"అంతెందుకండీ!" సూర్యం సాగదీశాడు.

"నాది ఖరీదైన ప్రాణం కాబట్టి. విసిగించక వెళ్ళు. తొందరగా రా. ధృవుడు వెళ్ళిపోతాడు" కసిరి పంపించాడు.

సూర్యం అయిదు నిముషాల్లో చిన్న సంచీతో వచ్చాడు. నంబూద్రి దాన్ని ధృవుడికిచ్చి "ఏదో నా సంతోషం కొద్దీ" అన్నాడు.

ధృవుడు యింటికి వచ్చి డబ్బు లెక్కపెట్టాడు.

పదిహేనువేలున్నాయి.

## 20

నంబూద్రి ఆ రాత్రి వైస్రాయి విస్కీ సేవించినా నిండుగా నిదురపోలేక పోయాడు. షాక్‌నుంచి మనసు తేరుకోలేదు. ఏవో భయంకరమైన కలలు. వులిక్కిపడి లేస్తూనే వున్నాడు. లీలావతి మంచం దగ్గరే కాపలా కూర్చుంది.

తెల్లవారింది ఎప్పటికో.

డైనింగ్ హాల్లో కాఫీ త్రాగుతున్న నంబూద్రిని తిరిగి అందరూ చుట్టుముట్టారు. లీలావతి ఆలయాల్లో పూజలు చేయించడానికి ప్రయత్నాలు చేస్తోంది.

ధృవుడికి అంత డబ్బు యివ్వడం సూర్యానికి ఏ మాత్రం యిష్టంలేదు. పదో పాతికో యిచ్చి సరిపెట్టకూడదూ! కాకతాళీయంగా వాడివల్ల లాభం పొందాం. ప్రతిఫలానికింత రేటు వుండాలని వుందా!

రాత్రే యీ విషయం తమ్ముళ్ళతో చెప్పాడు. వారికీ యింత డబ్బు యివ్వడం యిష్టంలేదు. కాని తండ్రి భయంవల్ల ఎదిరించలేక పోయారు. తండ్రి గండంనుంచి బయటపడినా వారు సంతోషించలేక పోయారు. మరోలా జరిగితేనే బాగుండేది. తాము స్వతంత్రులయ్యే వారు!

వాళ్ళ ముగ్గురికీ స్వంత వ్యక్తిత్వాలు లేవు. 'నంబూద్రి కొడుకులనే' అంటారు వూళ్ళో. పేర్లు కూడా బాగా తెలియదు. ఏ పనీ స్వతంత్రించి చెయ్యడానికిలేదు. ఆఖరికి పెళ్ళాన్ని పుట్టింటికి పంపాలన్నా తల్లితో సిఫార్సు చేయించి చెప్పాలి. ఈ నియంతృత్వానికి వారిలో బడబాగ్ని రగులుతోంది.

"ధృవుడు నిన్న లేచి ఎవరి ముఖం చూశాడో అదృష్టం పడింది" అన్నాడు గణపతి.

"నేను మాత్రం నీ ముఖం చూసివుంటాను" అన్నాడు నంబూద్రి అప్రసన్నంగా.

సుధాకరం కూడ వూరుకోలేదు "ఇంత డబ్బు వాడి జీవి

తంలో చూసివుండడు."

"నేను మాత్రం పునర్జన్మ ఎత్తాను."

తండ్రికి కోపం వస్తోందని గ్రహించాడు సూర్యం. "అది మా అదృష్టం నాన్నగారూ."

నంబూద్రిలాంటి మనిమేకర్స్ సెంటిమెంట్స్ దగ్గర పప్పి కొడతారు. తనకి గడచింది ప్రాణగండం. ధృవుడిపల్ల జీవితం కాపాడబడింది. తను మరో నాలుగు కాలాలపాటు రూపాయిలచేత సర్కస్ చేయించగలడు. అందు కవకాశం యిచ్చిన ధృవుడ్ని సంతోషపెడితేనేం? తనకి కొడుకులు, బంధువులు, స్నేహితులు, నౌకర్లు ఎంతోమంది వున్నా ఆ క్షణంలో ఎవరూ వుపయోగపడలేదు.

ధృవుడు తన ప్రాణదాత!

నంబూద్రి స్నానంచేసి వరండాలోకి వచ్చేసరికి పరామర్శ కోసం జనం. ప్రముఖ వ్యక్తికి చీమ కరిచినా ప్రపంచం పానుభూతి ఒలికిస్తుంది. ఇక్కడకూర్చుంటే ఆలస్యంకాకమానదు. 'ఇప్పుడే వస్తాను' అని కారెక్కాడు.

ధృవుడి యింటిముందు ఆగింది. ఆ పేటలోకి కారు రావడం చూసి పిల్లలు సంబరంగా చుట్టుముట్టారు. నంబూద్రి మూసిన తలుపు చూపి 'ధృవా' అని పిలిచాడు.

పుష్ప పెరట్లో పిల్లలకి స్నానం చేయిస్తోంది. స్వరాజ్యం వాళ్ళ యింటి వసారాలోంచి "అక్కా.....పెద్దయ్యగారు వచ్చారు" అంది.

"నంబూదిరిగారా."

స్వరాజ్యం తలూపింది.

ఆలస్యం చేయడం బాగోదని "పీళ్ళకి రెండు చెంబులు పొయ్యి" అని పురమాయించి, చీర సవరించుకుని తలుపు తీసింది.

"దండాలయ్యా."

"ధృవుడు లేడేమిటే?"

"పేటకి పోయాడు.....వచ్చేత్తాడు. కూకోండి" కర్ర కుర్చీని ఆయన ముందకు తోసింది.

నిన్న తనకి జరిగిన ప్రమాదాన్ని చెబుతూనే పుష్పని తినే

శాలా చూడసాగాడు. ఆమె ఒంటరిగా దొరకడం కోరికని వృద్ధి చేస్తోంది.

"మావల్ల మాట దక్కడం షూకూ సంతోషంగా వుందయ్యా! ఆ రోజున పెద్ద మనసుతో సాయంచేశారు. మీ మంచితనమే మిమ్మల్ని కాపాడతాది."

అలా తనని పూజ్యంగా భావించడం నంబూద్రికి కొరడాతో కొట్టినట్లయింది. తను ఎందుకు చేరదీశాడో యిప్పటికీ పుష్పకి తెలియదు.

గాలి మాట్లాడుతూ నంబూద్రి గంట కూర్చున్నాడు. పుష్ప సమక్షం శిఖరాన్ని ఎక్కినట్లుంది.

ఇంకా ధృవుడు రాలేదు. "నీ పని పోతున్నాది" అంటూ నంబూద్రి కారు దగ్గరకి నడిచాడు. పోలయ్య అక్కడ వున్నాడు.

"బాబుగారికి యింటికెళ్లాలనిలేదు" ముసిముసిగా నవ్వినాడు.

నంబూద్రి కారెక్కి కూర్చున్నాడు. విండోలోంచి చూస్తూ "ఇంకా నువ్వు ఆలస్యంచేస్తే కుదరదురా! పదిరోజుల్లో పుష్ప రెస్ట్ హవుస్‌కి చేరాలి" ఆదేశించాడు.

"సిత్తం. అదే ప్రయత్నంలో వున్నానండి."

"పని పూర్తవ్వాలి. ఎంతకావాలో తీసుకో" కారు ముందుకు పరుగెత్తింది.

పోలయ్య బుర్ర గోక్కుంటూ 'ఇంకా వీడు రాలేదా?' అరుగుమీదున్న పుష్పని పల్కరించాడు.

"లేదు బాబాయ్....పెద్దయ్యగోరికి మనమంటే ఎంత అభిమానమో సూసావ్? సాయంగా మనింటికి ఒచ్చారు" పుష్ప పొంగిపోతూ చెప్పింది.

ఆమె ముఖంలోకి జాలిగా చూశాడు. "ఎంత ఎర్రిముకానివే పుష్పా....ఆడు కుక్కలా యెందుకు తిరుగుతున్నాడో తెలిత్తే గుండెలు పగిలిపోతాయి నీకు" అనుకుని పోలయ్య తనింటికి దారి తీశాడు.

పదకొండు గంటలయింది. పుష్ప వంట పూర్తిచేసింది.

శివుడు పలకమీద అక్షరాలు దిద్దుతూంటే, లక్ష్మిని ఆడిస్తూ దగ్గర కూర్చుంది. మరో గంటయినా ధృవుడు రాలేదు. కంగారుపడి చింతడ్ని, మనవాళ్ళయ్యని వారింటికిపోయి అడిగింది. వాళ్ళు తెలీదన్నారు. తెలుసును. కాని చెప్పలేదు. నిన్న నంబూద్రి ధృవుడికి పదిహేనువేలు యివ్వడం కన్నుకుట్టింది. ధృవుడు తమతోటి పల్లె మనిషి కాదు యిక. యెదిగిపోయాడు.

పుష్ప విచారంగా యింటికి తిరిగి వచ్చింది....స్వరాజ్యం వచ్చి ఓదార్చి రెండు మెతుకులు తినిపించింది.

సాయంత్రమైంది. పుష్ప ఏడ్చే దశకి వచ్చేసింది. ధృవుడికేం ప్రమాదం జరగలేదుకదా! గంగమ్మ తల్లి అప్పుడప్పుడు సవతి తల్లి అవుతుంది. తన బిడ్డలని నాశనం చేసెయ్యడానికి కూడ జంకదు.

దీపం వెలిగించి నిరుత్సాహంగా కూర్చుంది. కాస్సేపటికి ధృవుడు వచ్చాడు.

పుష్పలో వేయి దీపావళులు. "యెక్కడికి పోయినావు.... యిప్పటిదాకా గోదారిమీదే వున్నావా? హడలి సత్తన్నాను" అతడి భుజాలమీద చేతులువేసి కుదుపుతూ అడిగింది.

చొక్కా విప్పి మంచంపై కూర్చున్నాడు. "బొండాంగాడి చేత కబురంపాను గదే! సెప్పనేదా?"

"కనిపించాడు. తెలీదన్నాడు."

"చేపల బుట్ట యింటికాడ యిమ్మని కూడ సెప్పాను. ఆరి యెదవా! అప్పుడే కుళ్ళిసత్తన్న రన్నమాట" మిఠాయి పొట్లం విప్పి శివుడికి లక్ష్మికి పంచుతూ అన్నాడు.

"ఆళ్ళేడిస్తే ఆగిపోతుందా? పెద్ద సేప ఏదయిన పడిందేమో ఆలీశం అయిందనుకుంటున్నా. మద్దేన్నం నుంచి బయపడి ఏడుత్తున్నానే. గాడిదకొడుకులు సెప్పారా?"

"నువ్వో పల్లెమడిసివి. సేపలూ సంతలూ!" ధృవుడు నవ్వాడు.

"నువ్వో కలకటేరువి." అంటూ పుష్ప వంటింటికి వెళ్ళి పొయ్యి వెలిగించింది. యిందాకట్నుంచి అన్నం వండడానికి కూడ

మనసు రాలేదు.

ధృవుడు స్నానంచేసి, పీటవేసుకుని దగ్గరగా కూర్చున్నాడు. చీకటిలోని పొయ్యి అగ్గి యవ్వనంలా మెరిసిపోతోంది.

నంబూద్రి వచ్చాడని చెప్పింది పుష్ప.

పొద్దుట గోదావరినుంచి వేటనుంచి ఒడ్డు యెక్కుతుండగా షణ్ముగం కనిపించాడు. ఇంటికి తీసుకెళ్లాడు. నంబూద్రిని రక్షించినందుకు మెచ్చుకుని చేపల కంపెనీ పెట్టమని సలహా యిచ్చాడు. పట్నం తీసుకెళ్లి వెంటనే ఏర్పాట్లు చేయించాడు. చేపలు పట్నం జేరెయ్యడానికి జీపు కూడ మాట్లాడిపెట్టాడు.

"అందుకని ఆలీసం అయింది. సన్ముగంబాబు రోజుకి ముప్ఫయి రూపాయిలు మిగులుతాయని లెక్కగట్టి చెప్పాడు. కలిసొస్తే అప్పుడే పెంచుకోవచ్చును. ఏమంటావు మరి."

పుష్ప ఒప్పుకుంది. అభివృద్ధి మరి యిది.

రెండ్రోజుల్లో గోదావరి గట్టున 'లక్ష్మీ ఫిష్ కంపెనీ' వెలసింది. ప్రారంభోత్సవం ఘనంగా చెయ్యాలని షణ్ముగం చెప్పడం వల్ల కంపెనీ యెదుట పందిరివేసి దీపాలతో అలంకరించారు. మైక్ పాటలతో అదరగొట్టేస్తోంది. షణ్ముగం తన బలగంతో వచ్చి ప్రారంభోత్సవం చేశాడు. నంబూద్రిని కూడ పిలవడానికి వెళ్లాడు. ఆయన వూళ్లో లేడు.

పల్లెకారులకి ఆ కంపెనీ సదుపాయంగా వుంది. చేపలు రేవులోకి రాగానే రూపాయలు వచ్చేస్తాయి. సంతకుపోయి అమ్ముకునే శ్రమలేదు.

స్వరాజ్యం, పుష్ప చేపల రకాలు విడదీసి బుట్టకట్టడంలో సహాయంచేస్తారు. రెండు గంటలకి సింగారవేలు జీపు వచ్చి వాటిని వేసుకుపోతుంది. ధృవుడు వారానికోసారి పట్నంపోయి బిల్లు తెచ్చుకుంటాడు.

మొదటి నెల రెండువేలు మిగిలింది. ధృవుడికి తనమీద నమ్మకం, భవితవ్యంపట్ల వుత్సాహం ఏర్పడినాయి. తను వేటకి పోవడం మానేసి తన పడవమీద జీతానికి ఒకడ్ని ఏర్పాటు చేశాడు.

పూర్తిగా తను కంపెనీ పనులే చూసుకోసాగేడు.

రెండవ నెల లాభం మరింత మురిపించింది. ముందుకు నడిపించింది. ఇదో కొత్త అధ్యాయం వాళ్ల జీవితంలో.

## 21

సూర్యుడు మంచి ముత్యంలా వుదయించాడు. సుధాకరం పిట్టగోడని ఆనుకుని ముఖం కడుగుతున్నాడు. పోలయ్య గడ్డిమేటులో నుంచి జనుం తీసి కట్టగాకట్టి ఎడ్లముందు సరిజేసి వేశాడు.

"పోలయ్యా."

"పిలిచారా బాబూ."

సుధాకరం స్వరం తగ్గించాడు వాడు దగ్గరకి వచ్చాక: "ఏరా: ముసలాయనికి తప్ప చిలకల్ని మాకు అందజేయవేమిట్రా."

పోలయ్య చిన్నగా నవ్వాడు.

"మా మీద శీతకన్నేనన్న మాట" నిష్టూరంగా చూశాడు.

"అదేంటేదు బాబయ్యా. మీరు కోరితే మీకు మాత్రం కాదంటానేటి?"

"మాట తప్పవుగా."

"బలేవారు."

"వెయ్యిస్తాను నీకు."

"సెప్పండి ఎవరు కావాలో."

"స్వరాజ్యం."

పోలయ్య వులిక్కిపడ్డాడు. ముఖం జేవురించింది. 'సినబాబూ' కోపంతో గద్దించాడు.

"ఏరా నీలుగుతున్నావు. నువ్వు డఫర్‌గాడివి. నీ కూతురు పతివ్రతేమిట్రా? పింగారపేలు కంటె తీసిపోయామా ఏం."

"అది నిప్పయ్యా....ఎదవపని ఎప్పుడూ సెయ్యదు."

"నువ్వలా మురిసిపో. తప్పేంలేదు. ఒకసారి మాకు కూడా రుచి చూపించు. స్వరాజ్యం అందం...."

సుధాకరం మాట పూర్తి చెయ్యలేదు: చెంప ఛళ్‌మంది 'పెద్దింటోడివని యిట్టమొచ్చినట్టు మాట్టాడబోక.'

"నన్ను కొడతావురా నాయాలా" సుధాకరం తిరగబడ్డాడు.

పోలయ్య కూడ చెయ్యి కలిపాడు. సుధాకరాన్ని ఎప్పటి నుంచో నోర్మూయించాలని వుంది. ఇవాళ అవకాశం వచ్చింది. చితగ్గొట్టి....పశువుల దొడ్డినుంచి రోడ్డుమీదకి వచ్చాడు. ఇంటికి బయలుదేరాడు. సుధాకరానికి బుద్ధిచెప్పినా శాంతిగాలేదు. సుధాకరం చెప్పింది నిజమా అనిపిస్తోంది.

"స్వరాజ్జెం!" యింటి గుమ్మంలోంచే పిలిచాడు.

జవాబులేదు. ఇంటికి తాళం. చేపల కంపెనీ దగ్గర వుంటుందని అక్కడికి బయలుదేరాడు.

స్వరాజ్యం చాపలో చేపలు ఆరబెడుతోంది. సింగారవేలు కూడ పనిలో సాయం చేస్తున్నాడు.

సింగారవేలు యం. ఏ. ప్యాసయ్యాడు. ఉద్యోగం దొరక లేదు. టాక్సీ అద్దెకి తీసుకుని సొమ్ము వెనకేసుకుని జీపు కొను క్కున్నాడు. చిన్నచిన్న కంపెనీల సరకులు కాంట్రాక్టుగా జేర వేస్తూంటాడు.

ఇతరత్రా పనేం లేకపోతే యిక్కడికి పెందరాడే వచ్చేస్తాడు. ఎందుకంటె యిక్కడ స్వరాజ్యం పెద్ద ఆకర్షణ.

యవ్వనం స్నేహం కలిపింది.

"మధ్యాన్నం టౌన్‌కి రావాదూ. మంచి పిక్చర్ ఆడుతోంది. మేట్నీ చూద్దాం" అన్నాడు సింగారవేలు.

"సూడొచ్చులే....ముంధు మీ అన్నాయని తీస్కురా మా అయ్యాకాడికి."

"ఏం పిల్లా! పెళ్ళిమీదికి పోయింది మనసు" ఆమె నడుం మీద కితకితలు పెట్టాడు.

స్వరాజ్యం నవ్వుతూ తప్పించుకుంటూ 'వుండు' అంటోంది.

సరిగ్గా ఈ సమయంలో పోలయ్య వచ్చాడు. దూరాన్నుంచే చూశాడు. వణికిపోయాడు. దగ్గరకి వచ్చాడు మండిపోతూ! "ఆడి మాట నిజమేనన్న మాట....అబద్ధమనుకున్నాను."

ఆ కోపానికి ఇద్దరూ విస్తుపోయారు. "ఏంటయ్యా"

స్వరాజ్యం అడిగింది.

కూతుర్ని ఎడంగా తోశాడు. ముందుకు వచ్చి "నీ సిగ్గులేని దానా. ఇంకా నా కళ్ళు కప్పాలని సూ_త్తన్నావన్న మాట. నానంత ఎఱ్రి ఎదవనుకాను" అంటూ సింగారవేలు కేసి తిరిగి "యిక్కడ నీ పనేంట్రా అసలు" కోపించాడు.

లోపల గదిలో గ్రేడింగ్ చూస్తున్న ధృవుడు, గలాటా విని హాల్లోకి వచ్చేశాడు. పోలయ్యని గదిలోకి తీసుకెళ్ళి శాంత పరిచాడు.

"సింగారవేలు మనవాడే మావా? మనువు మాటలకి అతడి అన్న ఇవాళ వస్తానన్నాడు. వాళ్ళేం తప్పుచెయ్యడంలేదు. నేను చూస్తూనే వున్నాను కదా?"

ధృవుడు చెప్పడంతో నమ్మాడు. సమాధాన పరచుకున్నాడు ఆవేశాన్ని, "ఇదంతా ఆ యెదవ ఆడిన నాటకం."

నంబూద్రి యింటి దగ్గర జరిగింది వివరంగా చెప్పాడు. "నేను యెదవ పనులు సేయచ్చు. అంచేత నా కూతురు కూడ సెడ్డదేనా? వురేయ్ బేగా దాని మనువు జరిగిపోవాల."

మధ్యాన్నం పోలయ్యకి కబురు వచ్చింది నంబూద్రి దగ్గర్నుంచి. పొద్దుట గొడవ గురించేనని తెల్సు. పోలయ్య నిర్భయంగా వెళ్ళాడు.

కాని నంబూద్రి ఏం ఆవేశపడలేదు, కేకలెయ్యలేదు. "నేను లేనట్రా సరిచెయ్యడానికి? ఏదైన వస్తే ముందర నాతో చెప్పు" అన్నాడు శాంతంగా.

పోలయ్య ఆశ్చర్యపోయాడు. "తొందరపడిపోయాను బాబూ."

"తొందరగా, అంటే రేపు రాత్రిలోగా పప్పని తీసుకురావాలి. ఇది నీకు చివరి అవకాశం."

పోలయ్య తలూపి బయటకి వచ్చాడు. యింటికి వెళ్ళాలనిపించలేదు. వినాయకుడి గుడి అరుగుమీద కూర్చున్నాడు.

మనిషి భౌతికంగా యితరులకి అన్యాయంచేస్తాడు. మానసికంగా తనకే అన్యాయం చేసుకుంటాడు అప్పుడప్పుడు. మానవత్వం

విజృంభించినపుడు. అలాంటప్పుడే ఎడారిలో వసంతం వికసిస్తుంది.

పుష్పని నంబూద్రికి అందజేయడం పోలయ్యచేతిలో పనే. అదేం కష్టంకాదు. పైగా బాగా లాభిస్తుంది. అయినా అది యిష్టం లేదు. పుష్ప తన కూతుర్ని కాపాడింది. ఆమెవల్లే మంచి సంబంధం కుదిరింది. ఆ పిల్లకి అన్యాయం చెయ్యడమా?

పోలయ్య ఒక విధంగా నిర్ణయం తీసుకునే ముందరగా, సమస్య మరోవైపుకి జరిగింది!

పోలయ్యపై ఎలాంటి చర్య తీసుకోనందుకు సుధాకరానికి కోపం వచ్చింది. అతడి భార్య పద్మరాణి అవమానం భరించలేక పుట్టింటికి ప్రయాణమైంది.

"నౌకరుకంటె హీనమయిపోయాం. ఎందుకొచ్చిన వెధవ బ్రతుకు....ఛీ! నేను కావలిస్తే....అభిమానముంటే మా యింటికే రండి." పద్మరాణి పిల్లల్ని తీసుకుని టాక్సీలో పుట్టింటికి వెళ్ళి పోయింది.

సుధాకరానికి దానితో పౌరుషం ముంచుకు వచ్చింది. పోలయ్య మీద కంటె తండ్రిమీద అంతులేని ఆవేశం వచ్చింది. తెగించాడు.

మిల్లుని రెండు లక్షలకి లీజుకిచ్చేసి అత్తవారింటికి పోయాడు.

ఈ విషయాలు నెమ్మదిగా నంబూద్రికి తెలిశాయి.

"వాళ్లు అలా చేశారంటే చెయ్యరూ! ఆ వెధవని విరక్కొట్టి జైల్లో పడెయ్యరాదూ! దీనికి వూరుకుంటే వాడు ఏదయినా చేస్తాడు" సౌమ్యంగావుండే లీలావతి కూడా వేడెక్కిపోయింది.

బయటివాళ్ళు కూడ 'వాడ్ని అలా వదిలేశావేం?' అని నిల దీస్తున్నారు.

పుష్ప కోసం పోలయ్యని క్షమించాడు. కాని సమాజం తనని అపార్థం చేసుకుంటోంది. తన ప్రతిష్ట దెబ్బతింటోంది.

"అసలు విషయంమీద చర్య తీసుకుంటే, మనవాడికీ తప్పుంది. అందుకే వూరుకున్నాను సమయం వచ్చేదాకా! చూపిస్తా నా తడఖా!" అన్నాడు పెళ్ళాంతో.

ఆ రాత్రి శివాలయంలో దొంగతనం జరిగింది. దేవుడి విల

వైన నగలు పోయాయి. అవి పోలయ్య యింట్లో దొరికాయి.

"నాకేం తెలియదన్నాడు" పోలయ్య. గగ్గోలుపడ్డాడు. స్వరాజ్యం పెళ్ళి వారం రోజుల్లోవుంది.

పోలీసులు అరెస్టు చేశారు. ఆరు నెలలు శిక్షపడింది పోలయ్యకు.

ధృవుడు జైలుకిపోయి కలుసుకున్నాడు. పోలయ్య బెంగంతా కూతురిమీదే. ఆ దుర్మార్గులు ఎంతకయినా తెగించగలరు.

"నా యింటిలో వుంటుందనుకో! కాని ఒంటరిగా వుంచడం మంచిది కాదు. అనుకున్న మూర్తానికి మనువు జరిపించేస్తాను." అన్నాడు ధృవుడు.

అది సబబుగానే కనిపించింది పోలయ్యకి.

"మంచిదిరా అబ్బాయ్! పుష్ప, నువ్వు అయినవాళ్ళకంటె బాగా కాపాడతారు. ఇన్నాళ్ళు కుక్కలా సేవచేసినందుకు నంబూద్రి ఖైదుచేయించాడు దొంగకేసు పెట్టి. ఆడంతకంటె ఏం సెయ్య గలడులే. నేను బయటకి రానీ. వాడి కథ తేల్చేస్తాను. నాకూ వుంది తెలివి."

ఇంతలో పోలీసు వచ్చి టైం అయిందన్నాడు.

"ధృవా! స్వరాజ్యాన్ని, పుష్పని జాగరతగా వుండమను. ఒంటరిగా ఏడకీ పోవద్దను."

"అలాగే!" అన్నాడు ధృవుడు బయలుదేరుతూ.

## 22

నంబూద్రి గదిలో సీరియస్‌గా పచార్లుచేస్తున్నాడు. భోజనానికి పిలవడానికి లీలావతి రెండుమూడుసార్లు గది గుమ్మంలోనుంచి తొంగి చూసింది. భర్త పరిస్థితి చూసి పల్కరించలేకపోయింది.

నంబూద్రి దెబ్బతిన్న మత్తేభంలా వున్నాడు.

ప్రారంభోత్సవానికి ధృవుడు తనని పిలవలేదు. ప్రత్యర్థిచేత చేయించాడు. మరొకప్పుడయితే నంబూద్రికి కోపం రేగక పోవును.

ప్రస్తుతం నంబూద్రి అనేక విషయాల్లో నలిగిపోయి వున్నాడు.

సుధాకరం భార్య తిరిగి యింటికి రాలేదు తనుపోయి ప్రతిమాలినా.

సుధాకరం సాహసం మిగతావారికి దారి చూపించింది. గణపతి యిప్పటిదాకా చాటుగామాటుగా ఆడుకుంటున్నాడు పేకాట. ఇప్పుడు పెద్దాటలకి బహిరంగంగానే పోతున్నాడు. ఇది తనకి తెలిసి మంద లిస్తూంటే "మేమే లోకువ యింట్లో పడివున్నందుకు మా మీదే ప్రతాపం" అంటూ వాడి భార్య గంగ యుద్ధానికి వస్తోంది. అదో మూర్ఖురాలు. మొగుడ్ని బుద్ధిపూర్వకంగా పాడుచేస్తోంది. గొడవలు భరించలేక తనే నోర్మూసుకోవల్సి వస్తోంది.

సూర్యం పెద్ద కొడుకయినందుకు పెద్దగానే బుద్ధిచెప్పాడు. మా నాన్నగారు యిమ్మన్నారు. అంటూ అయిదారుగురి దగ్గర లక్ష దాకా చేబదులు, వ్యాపారం సొమ్ము రెండు లక్షలు పట్టుకుని తోడల్లు డింటికి వుడాయించాడు. సినిమా తీస్తాడట. షణ్ముగం మద్దత్తుదారులు కూడ తనని 'కొత్త' దొంగలా చూస్తున్నారు. నంబూద్రి ప్రభ పెరగనీయరాదని వారి పట్టుదల. అక్కడ గుంపులో ఒకడిగావుండే కంటె ఒంటరిగావున్నా పెద్దగానే వుండాలని వ్యతిరేక పార్టీలోకి వచ్చాడు.

ఈ పరిస్థితిలో ధృవుడు చేసినది భూతద్దంలోని చీమలా కనిపిస్తోంది. కృతఘ్నుడువాడు. ఏదో పెళ్ళానికి చీరలు నగా పెడతా డని అంత డబ్బు యిచ్చాడు తను. గట్టుమీదనుంచి ప్రయత్నించడం కాదు. నీళ్ళలోకి దిగాలి.

ఏమైన, ఎలాగైన, ఎంతయినా పుష్పని పొంది తీరాలి.

నంబూద్రి గది దాటి వచ్చాడు. ఇల్లు నిశ్శబ్దంగా వుంది. గేటు దగ్గర గుమ్మంలో నిలబడి రోడ్డుకేసి నడవసాగేడు.

అవధాని సైకిల్‌మీద వెళుతున్నాడు.

పిలిచాడు.

నంబూద్రివంటి ప్రముఖ వ్యక్తి తనని పిలవడం అవధానికి అబ్బురంగా తోచింది. తను డాక్టరయినా, తన అవసరం ఆయనకి లేదు. నంబూద్రికి రొంప పట్టిందని తెలిస్తే పట్నంనుంచి యండీలు వస్తారు.

ఇద్దరూ వరండాలో కూర్చున్నారు. నంబూద్రి కుశల ప్రశ్నలు వేశాడు. షర్బత్ తెప్పించాడు. వైద్యం బాగా సాగుతోందా అని అడిగాడు. ధృవుడింటి దగ్గర రోజూ కనిపిస్తున్నావట 'ఏదైన రాజకీయం' నడుస్తోందాని నవ్వాడు।

"అదేం లేదండి. శివుడికి నిత్యం ఏదో రోగమాయె।"

"ధృవుడు బాగా ముట్ట చెబుతాడే।"

"ఇంటి పెత్తనం పుష్పదే. అది మహా తెలివైనదండి. కష్టం దాని చేతిలో వుంది కనుకనే సంసారం అలావుంది।"

అరగంట తరవాత నంబూద్రి భోజనానికి లేస్తూ "ధృవుడ్ని ఒకసారి కనపడమను" అని చెప్పాడు.

అవధాని వూర్లో రెండు మూడు కేసులు చూసి భోజనానికి యింటికి వెళ్ళేసరికి చక్రకేళీ అరటిపళ్ళ గెల, వంకాయలు, బియ్యం బస్తా దర్శన మిచ్చాయి. "యెక్కడివి?" అని భార్యని అడిగాడు.

"నంబూద్రిగారు, పంపారు" అందావిడ.

"ఊరకే దయరాదు మహాత్ములకి" అనుకున్నాడు. భోజనం చేసి ధృవుడి కోసం గోదావరి దగ్గరకెళ్ళి చెప్పాడు.

పుష్ప, స్వరాజ్యం చేపలు బుట్టల్లో పోస్తున్నారు. ధృవుడు ప్యాకింగ్ చేస్తున్నాడు. అవధాని చెప్పగానే బయలుదేరబోయాడు.

"బాగుంది. లేడికి లేచిందే ప్రయాణమా। పనయ్యాక ఎలుదువుగాని. నువ్వు వచ్చేదాకా సింగారవేలు కూకుంటాడా।" అంది పుష్ప.

అది నిజమేననిపించింది ధృవుడికి.

అవధాని కాసేపు కూర్చుని వెళ్ళిపోయాడు. మరో గంటకి బుట్టలు జీపు ఎక్కాయి.

"అక్కా। నన్ను కూడ పట్నం రమ్మంటున్నాడు. పినే మాకి" స్వరాజ్యం జీపుకేసి నడుస్తూ చెప్పింది.

"వదినా.... నేనేం అలా సెప్పలేదు" సింగారవేలు స్టార్టు చేస్తూ అన్నాడు.

పుష్ప నవ్వి వూరుకుంది. కొత్తగా పెళ్ళయిన జంట.

ఏకాంతం కావాలనుకుంటారు. జీపు వెళ్ళగానే పుష్ప లోపలకి వచ్చింది. ధృవుడు లెక్కలు చూసుకుంటున్నాడు.

"నేను ముందుపోయి టీ పెడతాను రా. తాగి నంబూదిరిగారి దగ్గరకి పోదువుగాని."

ధృవుడు లెక్కలు కడుతూనే తలూపాడు.

ఇద్దరూ పూర్వంకంటె కష్టపడుతున్నారు. శ్రమజీవనంలోని మాధుర్యం వారికి తెల్సింది. కొంతమంది డబ్బురాగానే విర్రవీగి పోతారు. ఎలా ఖర్చుపెట్టేద్దామాని ఉవ్విళ్ళూరిపోతారు. డబ్బు వచ్చినా వారి జీవనవిధానాల్లో ఏం మార్పు రాలేదు.

ధృవుడు వ్యసనాలకి దూరమయ్యాడు. పుష్పకి సింగారాలంటే మోజేంలేదు. వెనకటిలాగానే సాదాచీరలతో, పాతకడియాలతో కాల క్షేపం చేస్తూంది.

రూపాయిల్ని పెంచి పెద్దచెయ్యాలి.

ఇద్దరికీ ఒకటే కసి. ఒకే కల. ఒకే గమ్యం. ఈ డబ్బు ముందుకు దారి చూపించాలి.

ధృవుడు టీ త్రాగి నంబూద్రి యింటికి వెళ్ళాడు. ఆయన వరండాలోని ఈజీచైర్‌లో పేపరు చూస్తున్నాడు. ధృవుడికోసం మధ్యాహ్నంనుంచి ఎదురుచూస్తున్నాడు. ఆలస్యంగా రావడం తనని నిర్లక్ష్యం చెయ్యడమేననిపించింది. ముల్లులా దిగినట్లయింది.

నంబూద్రి కార్యవాది. మొరిగే కుక్క కాదు. కరిచే కుక్క. హడావిడి చేయడు. చలిచీమలా చేసుకుపోతాడు.

"ఏమిటి చిక్కిపోయావ్ ధృవా?" ఆప్యాయంగా పల్కరించాడు.

"మీ అభిమానం."

కుర్చీ చూపించాడు నంబూద్రి మాటవరసకి. ధృవుడు కూర్చున్నారు. ఇది నంబూద్రికి ఆజ్యం పోసినట్లయింది. క్రింద తరహా వ్యక్తులు ఆయన ఎదురుగా కూర్చోరాదు. నిలబడే మాట్లాడాలి.

"వ్యాపారం బాగా నడుస్తోందా?"

"మీ దయ."

"మీరు కష్టపడే వ్యక్తులయ్యా. అందుకే నాకు యిష్టం. ..లాంటివారు ఎందులోవున్నా రాణిస్తారు. నాకు అదే కావాలి" ..ంబూద్రి పొగిడారు.

ధృవుడు మందహాసం చేశాడు.

నంబూద్రి తన అస్త్రం తీశాడు. "మన పడవలరేవు వేలం ..కి వచ్చిందయ్యా! అందరూ తమకి చేసిపెట్టమని చంపేస్తున్నారు. .. దృష్టిలో మాత్రం నువ్వున్నావు. అది నీకే చెయ్యాలను టున్నాను."

తన పురోగమనానికి అప్రయత్నంగా యిలా మెట్లుపడడం ..ృవుడికి సంతోషంగానే వుంది. ధృవుడికి సాహసాలు చేసి ..ుందుకి వెళ్ళాలని వుంది.

"పుష్పకి కూడ చెప్పు. ఆమె సరేనంటే రేపు వుదయం ..చ్చెయ్ నా దగ్గరకి. ఇద్దరం కలిసివెళదాం. రేపే ఆఖరి రోజు ..టెండర్‌కి."

ధృవుడు తలూపాడు.

*　　　*　　　*

"నేనేం సెబుతాను. అన్ని తెలిసినవోరు నంబూదిరిగోరు. ..యన సెప్పినట్లు సెయ్యి. మనకేదైనా వుపకారం సెయ్యాలని ఆ ..ు తాపత్రయం" అంది పుష్ప నిండుమనసుతో భర్తతో, ..షయం చెప్పాక.

మర్నాడు ధృవుడు నంబూద్రితో పట్నం వెళ్ళాడు. నంబూద్రి ..వతల వైపు 'సింగయ్య'ని నిలబెట్టి వేలంపాట పెంచేశాడు. ఇది ..ృవుడికి తెలీదు.

అరవై వేలనగానే ధృవుడికి భయంవేసింది.

"వ్యాపారాల్లో వెనక చూపు లాభంలేదు. అరవై రెండు అనే ..సెయ్. సింగయ్య అంతదాకా రాలేదు. మనకేం నష్టముండదు," ..ంబూద్రి వుత్సాహపరిచాడు.

నాలుగవవంతు ముందరకట్టాలి. మిగతాది రెండు వాయిదాల్లో

కట్టాలి. కాంట్రాక్టు పుచ్చుకున్నాడు ధృవుడు. చేపల వ్యాపారంలో డబ్బు యిందులో తిరగేశాడు. నాలుగురోజుల్లో యిరవై వేలు అప్పు యిస్తానన్నాడు నంబూద్రి. ఆ ధీమామీదే ధృవుడు డబ్బుకట్టాడు.

వారమైనా నంబూద్రి యివ్వలేదు. రేపుమాపు అని తిప్పు తున్నాడు. అవతల చేపలు కొన్నవారికి డబ్బు సరిపెట్టాలి. కంపె యిచ్చేడబ్బుకూడ ముందర వాడేశాడు. వాయిదాలు ఎన్నిసా వెయ్యడం?

"నా పని గోరంగావుందిబాబూ! చేపలు ఏపినవారు డబ్బు పీక్కు-తింటున్నారు!" అన్నాడు అసహనంగా ధృవుడు.

నంబూద్రి వికటంగా నవ్వాడు. "ముందరుందిరా ముస పండగ. రేవుపాట పాతికవేలు దాటితే చిప్పే. నిన్ను గోతులో తొయ్యాలనే చేశాను."

ధృవుడికి మతిపోయింది.

## 23

అవధాని సైకిల్ దిగాడు. బయట ఎవరూలేరు. 'నంబూద్రి గారూ' అని ఓ కేకవేశాడు గుమ్మం దగ్గర నిలబడి. ఎవరూ పల లేదు. ఇంట్లోకి నడిచాడు.

అవధానికి పూర్వం నంబూద్రి యింటికేసి చూసే ధైర్య కూడ వుండేది కాదు. ఇప్పుడు ఆయన సరసన కూర్చుంటున్నాడ ఆ అధికారం పొందగలిగాడు. నంబూద్రి యిచ్చాడు.

పుష్పకోసం.

పోలయ్య జైలుకి పోవడంతో పుష్పని తన దగ్గరికి రప్పి కోడానికి అవధానిని ప్రయోగించాడు. నంబూద్రి యిన్నాళ్ళు పుష్ప చూస్తూనే వున్నాడు. చొరవ చెయ్యలేకపోయాడు. తెలుసుకుంటూ వున్నాడు. తొందరపడలేక పోయాడు. మట్టిలా ఓర్పున్నా, గాలిల బలంవున్నా, సూర్యుడిలా తేజమున్నా పుష్ప విషయంలో ఆలస్య జరిగిపోయింది. పోలయ్య వెనకనుంచి గోతులు తవ్వడంవల్ల. ఈ నాడు యిక తెగించాడు.

పుష్పయింటికి వైద్యంమీద రోజూ వెళ్ళేవాడు అవధాని

ందుకే చేరదీశాడు. తన కోరిక చెప్పాడు. వెల చెల్లించాడు. వధాని ఒప్పుకున్నాడు.

"ఇంకా లేవలేదయ్యా....లేచేప్రైం అయింది. కూర్చో!" ంది లీలావతి హాల్లో ఎదురై!

అది మామూలు వాళ్ళు చేసేపని. అవధాని అలా చేస్తాడా? బూద్రి పడుకున్న గదిలోకి వెళ్ళాడు. మంచి నిద్రలో వున్నా తట్టి పాడు.

నంబూద్రి విసుగ్గా లేచాడు. అవధానని తెలిశాక బలవంతంగా వ్వి "కూర్చో....తొందర పనిమీద వచ్చినట్లున్నావు" అన్నాడు చి కూర్చుని.

అవధాని చెప్పాడు.

"నిజం!" నంబూద్రి రెట్టించాడు.

"అవునండీ. ధృవుడు పొద్దుటే విశాఖపట్టణం వెళ్ళి యాడు. స్వరాజ్యం దాని మొగుడు టౌనుకి సినిమాకి వెళుతున్నారు. ంటి దగ్గర వుండేది పుష్ప ఒక్కత్తే. ఆమె కూడ వెళ్ళేదే. ్వరం వుందని కదలడానికి వీల్లేదని చెప్పాను" అవధాని వుత్సా ంగా చెప్పాడు.

నంబూద్రి భుజంతట్టాడు. "చీకటిపడ్డాక యింజెక్షన్ చేసెయ్యి. యీలోగా మనుషులని కాపలా వుంచుతాను ధృవుడుకాని, రాజ్యంకాని వచ్చినా యింటికి రానివ్వకుండా చూస్తారు వాళ్ళు."

"ఇకనేం పుష్ప మీది."

గడియారం నాలుగున్నర చూపిస్తోంది. పనిమనిషి యిద్దరికి టీ పట్టుకొచ్చింది. టీ త్రాగుతూ యిద్దరూ మరల తాపీగా చర్చించారు.

అయిదింటికి అవధాని వెళ్ళిపోయాడు

"పుష్పా! ఇన్నాళ్ళు ఏదో రోజున నువ్వు అందకపోవని శపడుతూవచ్చాను. మీకూ మొలకలు వచ్చాయి. నువ్వు యింకా తీవ్రమైపోతావు. ఈ లోగానే నీ అందాలు చందాలు నేను అనుభ ంచేయాలి" నంబూద్రి అనుకున్నాడు.

అవధాని చీకటిపడ్డాక పుష్ప యింటికి వెళ్ళాడు. పుష్ప పడు

కుంది. శివుడు, లక్ష్మి ఆడుకుంటున్నారు.

"ఎలా వుందమ్మా జ్వరం?" అవధాని థర్మామీటరు తీ చూశాడు.

"బాగానే వుందండి. అన్నం కూడా తినేశాను."

"లోజ్వరం కాస్తోంది. అన్నం తిన్నా ఫర్వాలేదు. మం మందు పడితే."

అవధాని థర్మామీటర్ చూస్తూ 'నూటమూడు' అన్నా గట్టిగా. "రాత్రి యింకా పెరుగుతుంది రోగం. ఓ ఇంజెక్షన్ నిస్తే ప్రొద్దుటకి తగ్గిపోతుంది" అన్నాడు.

"మీ యిట్టం అలాగే సెయ్యండి" అంది పుష్ప.

అవధాని 'పెతిడిన్' చేశాడు. పుష్ప మత్తుగా మంచంమీ పడిపోయింది. పిల్లల నిద్దర్నీ వంటింటిలో పెట్టి గడియవేశాడు. తా సైకిల్ ఎక్కి వేగిరం వూళ్ళోకి వచ్చాడు. నంబూద్రి పంచాయి ఆఫీసుదగ్గర వెయిట్ చేస్తున్నాడు.

"రండి" అన్నాడు దూరం నుంచే.

"అంతా పూర్తయిందా?"

"ఆఁ"

ఇద్దరూ బయలుదేరారు. వూళ్ళో అక్కడక్కడ దీపా వెలుగుతున్నాయి. చలిగాలి వీస్తోంది. తుప్పర పడుతోంది. చుక్క మింగేశాయి మబ్బులు.

అవధాని రోడ్డు మొగలోని చెట్టుక్రింద ఆగిపోయాడు. పాలెంలో కరెంటులేదు. వీధులు చీకటిగానే వున్నాయి. ఎదు చూపిన అనుభవం పొందే సమయం సమీపించడంతో అనం అడుగులు తడబడుతున్నాయి.

పుష్ప యిల్లు దగ్గరపడింది. ఒకసారి అటు ఇటు చూ ఇంట్లోకి దూరి తలుపు మూశాడు నంబూద్రి.

* * *

పోలయ్య అనుకున్నదానికంటె వారం ముందుగానే విడు లయ్యాడు. ఊళ్లో బస్సు దిగేసరికి చీకటిపడింది.

కాళింది దుకాణం దగ్గల మత్తుగా త్రాగాడు. ఇన్నాళ్ళ తర్వాత సారా నాలికమీద నాట్యంచేసి వింత అనుభూతి నిచ్చింది. కోడి పకోడీలు తింటూ యింటికి బయలుదేరాడు.

'సొరాజ్జెం' తలుపుకొట్టాడు. సమాధానంలేదు తిరిగి తిరిగి పిలిచినా. తలుపుకి తాళం. "ఏడకి పోయింది సెప్మా! పుష్పకి తెలీక పోతుందా?" అనుకుంటూ ప్రక్కింటికి నడిచాడు.

పిలిచాడు. పుష్ప పలకలేదు. తలుపుకి తాళంలేదు. లోపల గడియవేసి వుంది.

"మరి పలకలేదేం....అప్పుడే నిద్దరోతోందా?"

"పు....ష్పా" ఈసారి గట్టిగా పిలిచాడు.

....లోపల నంబూద్రి బట్టలు మార్చుకుని మంచం దగ్గరకి వెళ్ళాడు. పుష్ప నిద్రలో వుంది. 'అలంకరణ లేకపోయినా దీని అందం ఏ ఆడదానికి వస్తుంది?' నంబూద్రి మైకంగా మంచంపై కూర్చున్నాడు. పుష్ప సాన్నిహిత్యం కోరికను వృద్ధిచేస్తోంది.

బయట కేక!

పోలయ్యదని తెలియగానే వులిక్కిపడ్డాడు. వీడెలా వచ్చాడు? కంగారు పుట్టేసింది. భయంవేసింది అంతటి నంబూద్రికి.

సంకట స్థితికి నలిగిపోయాడు నంబూద్రి.

పోలయ్య పెరటివైపుకి వచ్చాడు. సన్నగా రాగం వినిపిస్తోంది. కిటికిలో నుంచి తొంగిచూశాడు. లోపల చీకటి. ఏడుపు. శివుడి ఏడుపు.

"శివా" పిలిచాడు.

శివుడు తడుముకుంటూ వచ్చి కిటికీలో నుంచి పోలయ్య చేతులు పట్టుకుని ఏడుపు లంకించుకున్నాడు. పోలయ్య బుజ్జగించాడు.

"పంతులుడాట్రు సెల్లిని నన్ను ఈడ పడేసినాడు అమ్మ వయిజ్యకానికి వచ్చి బేగా ఎల్లిపోయాడు. తలుపు తీయమన్నా అమ్మ తీయలేదు...."

ఏదో ప్రమాదం వుందనిపించింది. పోలయ్యకి 'తలుపుతీయి' అన్నాడు.

కివుడికి తలుపుగడియ అందదు. బిందెవేసుకుని ఒక్కి, పడి లేచి మొత్తానికి తీశాడు. పోలయ్య విసురుగా లోపలకి వచ్చాడు. మధ్యగది తలుపు వెదురుతడిక. తన్నగానే వచ్చేసింది.

వీధితలుపు తీసి వుంది. పుష్ప మంచాన వుంది.

ఈ సమయంలో నంబూద్రి రోడ్డుఎక్కాడు. ఎవరో పారి పోవడం పోలయ్యకి కనపించింది. దొంగనుకుని వెనకబడ్డాడు.

నంబూద్రికి పరుగెత్తడం అలవాటు లేదు. కాని తప్పదు. ఒగరుస్తున్నాడు. చీకటిలో దారి తెలియక పడుతున్నాడు.

నంబూద్రి దారి తప్పాడు. సందులు, గొందులు మారి పోవడంవల్ల గమ్యం దూరమవుతోంది.

పోలయ్య కూడ దారి తప్పాడు నంబూద్రి పోయేదశ గుర్తించలేక.

"పనయిందా బాబూ" ఓ కంఠం మొగలో పల్కరించింది. పోలయ్య ఆగిపోయి వెనక్కి తిరిగాడు. అది పంతులు డాక్టరు కంఠం అనుకుని "ఏం పనిరా?" చొక్కాపట్టుకుని గుంజాడు.

అవధాని ముందర తొట్రుపాటు పడి తర్వాత దబాయించాడు. "నన్ను పట్టుకుంటావేటి? నాకేటి తెల్సు?"

"నీ యవ్వారం యిక్కడ కాదు" అంటూ బరబరా ఇంటికి లాక్కుపోయాడు. అవధాని వాడి పశుబలం ముందు బొమ్మయ్యాడు.

"వచ్చిన ఓడు నంబూదిరి కదా! పుస్పకోసం నువ్వు దళారి పని చేసావ్ కదూ! నిజం సెప్పు. అబద్ధమాడితే దొమికి లేకీయ గల్ను" ఓ తాపుతన్నాడు. అవధాని అంతా చెప్పసాగేడు.

## 24

ధృవుడు ఆ రోజు నంబూద్రి చేసిన మోసం యింటికి వచ్చి భార్యతో చెప్పలేదు. దేవుడని మురిసిపోయే పుష్ప నమ్మదని.

ఆ రాత్రి అవధాని బొండాం అప్పన్నకి రెండొందలు ఇచ్చి, ధృవుణ్ణి ఎక్కడికయినా తీసుకెళ్ళమన్నాడు. విశాఖలోని తన బంధువుచేత అప్పు యిప్పిస్తానని ధృవుణ్ణి ప్రయాణం చేయించాడు. ధృవుడు ఆశగా వెళ్లాడు. రెండ్రోజులు అక్కడా యిక్కడా తిప్పి

బంధుపులేదని తిరుగు ప్రయాణం చేయించాడు.

ధృష్టుడు నిరాశగా యింటికి వచ్చాడు. పరిస్థితుల కర్క శత్వానికి డీలాపడిపోయాడు. నలిగిపోయాడు. నైరాశ్యంలో మునిగి పోయాడు.

ఇంటికి వచ్చేసరికి పోలయ్య జరిగిన ఘోరం చెప్పాడు.

"ఈడ్ని నాశనం చేసేత్తా. ఆడ్ని చంపయినా నేను సత్తాను. నన్ను నిలువునా ముంచినోడ్ని బతకనీయను!" ధృష్టుడు ఆవేశంతో బయలుదేరాడు.

పోలయ్య ఆపుచేశాడు. "ఆడు యింకా ఎక్కడున్నాడ్రా. బయపడి ఏ అయిదరాబాదో చెక్కేశాడు. యిప్పట్లో రాడు."

"ఏం ప్రెమాదం జరగలేదు గదా!" మంచంమీద వున్న పెళ్లాం దగ్గరకి పోయి అడిగాడు.

"లేదు" పుష్ప నీరసంగా అంది. ఆమెకి ఆ రోజునుంచి జ్వరమే. యివాళ కొద్దిగా నయం. భర్తని చూసి ధైర్యం తెచ్చు కుంది.

"ఓ సారి ఆడింటికి పోయి వత్తానాగు. వచ్చేదేమోనూసి వత్తాను!" పోలయ్య తువ్వాలు భుజంమీద వేసుకుని బయటకెళ్ళాడు.

తను దుర్మార్గంనుంచి కాపాడబడటంకంటె, తన కుటుం బంపై జరిగిన దుర్మార్గానికి పుష్ప నివ్వెరపోతోంది. ఇన్నాళ్ళు ముందుకు వెళుతున్నామని సంబరపడుతూ వచ్చింది. తాము వెళ్ళేది వెనక్కి. పతనంలోకి.

"ఇంత మెదవా నంబూదిరి....నా కోసరం యింత వాలయం పన్ని కూకున్నాడన్నమాట. ఈడి జనమ తగలడ!" పుష్ప లేచి కూర్చుని బూతులు తిట్టసాగింది.

ఐరువెక్కిన ముఖాన్ని రుద్దుకుంటూ చాపలో పడుకున్నాడు ధృష్టుడు. పెళ్ళాం ఆవేశం తెలుస్తోంది. ఏం మాట్లాడాలనిలేదు.

పిల్లలు ఏడుస్తూంటే స్వరాజ్యం వచ్చి తీసుకెళ్ళింది.

పట్టపగలయినా గాఢాంధకారంగా వుంది వాళ్ళకి. మనసులు మండుతున్నాయి.

దాహం తీర్చే నీరు దీప శిఖయింది.

నంబూద్రి దేవుడు కాదు దయ్యం.

వాడుచేసిన సాయం స్నేహంమీద కాదు. స్వార్థంతో.

పొద్దు తిరిగింది. పోలయ్య రాలేదు. స్వరాజ్యం పళ్ళెంలో పెట్టి అన్నం తెచ్చింది. ఇద్దరూ తినడానికి వుత్సాహం చూపించ లేదు. స్వరాజ్యం బలవంతంమీద రెండు ముద్దలు మింగి తిరిగి అచేతనంలో పడిపోయారు.

గండం ఎలా గడుస్తుంది?

అంతా చెదిరిపోతుంది, కాలం విచ్చలవిడితనంవల్ల. అంతా చెదిరిపోతుంది అశాంతి పీడనంవల్ల.

ముందుకుపోయే దారి మూసుకుపోయి వుంది. దానిమీద ముళ్ళతీగలున్నాయి. తప్పించుకోడానికి కొన్ని మార్గాలు కనిపించాయి పుష్పకి. కాని వాటికి స్పష్టతలేదు. తర్కంలేదు. అనుమానం. తిరిగి తుఫాను గాలిలా సమస్య ని వణికించింది. అంతరంగంలో లోపలి పొరలపై ఆ భయం ప్రతిఫలించింది. తిరిగి నివారణ కోసం ఎన్నో ఆలోచనలు అన్నీ సగం సగం తయారైనవే. వాటన్నిటినీ కలిపి ఒక మార్గం అన్వేషించడంలో ఆమె విఫలురాలైంది.

పొద్దు తిరిగింది. శివుడు, లక్ష్మి, స్వరాజ్యం ఇంట్లోనుంచి వచ్చేశారు. "అమ్మా....నాకాకలౌతోందే!" శివుడు తల్లి దగ్గర పేచీ లంకించుకున్నాడు.

నిస్సత్తువమీద నిద్రలేని కళ్ళు ముళ్ళుగా వున్నాయి పుష్పకి. కొడుకు ఏడుపుతో కసిరి రెండంటించిది.

"మన బాధలు ఆళ్ళకేం తెలుస్తాయ్....కుర్రోళ్ళు...." ధృవుడు లేచి కొడుకుని తన దగ్గరకి తీసుకున్నాడు. "రారా సెల్లికి నీకూ బటానీలు కొనిపెడతాను."

కాలవ దగ్గర కిళ్ళీకొట్టులో కొనిపెట్టి తిరిగి వస్తూండగా ఏటి గట్టుమీద బెచ్చాలు ఆడుకుంటున్న దైవసాయం, మనవాళ్ళయ్య, చింతడు పిలిచారు. పిల్లలని పంపేసి వాళ్ళ దగ్గరకి పోయి కూర్చు న్నాడు.

ఇపుడు వాళ్ళకి ఆనందంగా వుంది. ధృవుడు చితికిపోయాడ
అందుకే పిలిచి ఆప్యాయంగా మాట్లాడారు.

"మనమెంతో మన బతుకులెంతో సూసుకోవద్దట్రా... 
గిడితే మన కాల్లే యిరుగుతాయి" అని ఒకడు.

వాళ్ళ యెత్తి పొడుపులు ధృవుడ్ని కదిపాయి. అసహ
లేచింది. అక్కడ నిలబడలేక, వాళ్ళని ఎదిరించలేక ముంద
పోయాడు.

ఘొల్లుమని నవ్వులు!

ధృవుడింటికి పోలేదు. పిచ్చగా వుంది. ఏదో చేసెయ్యా
వుంది. కాని దాని దారి కనిపించడంలేదు. నాలుగు వీధులూ తి
సాగేడు.

"ధృ....వా"

తల మెత్తాడు. తను నంబూద్రి యింటిముందున్నా
అరుగు మీదనుంచి లీలావతి పిలుస్తోంది.

వెళ్ళాడు అయిష్టంగా.

"జరిగిందంతా వుదయం పోలయ్య చెప్పాడ్రా! నాకు చా
బాధనిపించింది బాబూ!" లీలావతి బాధపడుతూ గాద్గదిక
వాపోయింది.

"సవటలం. మమ్మల్ని అన్యాయం సేయక యెవర్ని చేస్తా
బాబు."

"మీ కన్నీళ్ళే మా శత్రువులురా!....వుండు"

లీలావతి తడబడుతూ లోపలకి వెళ్ళింది. ప్రస్తుతం అ
యింటిలోను ఆమె ఒక్కతే వుంటోంది.

లీలావతి సంసారం, పిల్లల్ని చూసుకునే సామాన
యిల్లాలు. భర్త రాజరికం, వ్యవహారాలు యింతకుముందు ఆ
తెలిసినా ఏం పట్టించుకునేది కాదు.

ఈనాడు కుటుంబం చితికిపోయింది. కొడుకులు యెవరి దా
వారు పోయారు. యిల్లు శూన్యమైంది. భర్త చేసిన దుర్మా
వుసురే తమ నీ గతికి తెచ్చాయని ఆమె అనుకుంది.

"ఇంట్లో అయిదువేలున్నాయి. పట్టుకెళ్ళు. తిరిగి ఏదయిన
దితే పంపిస్తాను. మీరు సుఖపడాలనే కోరుకుంటున్నాను."

ధృవుడు తీసుకోడాని కిష్టపడలేదు.

"మా అన్యాయానికి యిది పరిహారం కాదురా! ఏదో నా
ప్తికోసం. పుచ్చుకో" చొరవగా చేతిలో పెట్టింది.

ఇది భర్త యిష్టపడదని ఆమెకి తెల్సు. కాని తెగించింది.

ధృవుడు డబ్బు తీసుకుని యింటికి వెళ్ళాడు లీలావతిని
సులోనే అభినందించుకుంటూ.

మర్నాడు పోలయ్య, పొలం తాకట్టుపెట్టి పదివేలు తెచ్చి
చ్చాడు ధృవుడికి.

"నా కోసం పొలం తాకట్టు పెట్టావా?" పోలయ్య చేతులు
కున్నాడు.

ఈ రెండు సంఘటనలు కొత్త వూపిరి నిచ్చాయి ధృవుడికి.
ల వ్యాపారం మూసెయ్యనక్కరలేకుండా పని జరిగింది. తిరిగి
వ్యాపారం నడుస్తోంది. అయినా మనస్సు శాంతిగాలేదు; వేలం
నష్టం భూతంలా భయపెడుతోంది.

రోజూ యిరవై, పాతికా వస్తోంది రేవుమీద! అరవై వేలు
ప్పటికి పోగడుతాయి! ధృవుడు, పుష్ప నిరాశగా జీవిస్తున్నారు.

## 25

గోదావరి లంకలో వెంకటేశ్వరస్వామి విగ్రహం వెలసింది.
సాధువు ముందుగా గమనించి అక్కడ చిన్న పందిరివేసి
నలు ప్రారంభించాడు. మరి భక్తులు వూరుకుంటారా? సాధువుని
్నలు అడిగారు. సాధువు దేవుడి పేరుమీద నివారణోపాయాలు
సాగేడు. ఇది చుట్టూరా ప్రాకింది. ఇక జనం తీర్థ ప్రజే. ఏ
వా ఖాళీగా వుండటంలేదు. ధృవుడి అదృష్టం పండింది. బిక్క
ంవేసిన గల్లాపెట్టికి చైతన్యం వచ్చింది. ఇరవై రూపాయిలు
వని ఆదాయం వందల్లోకి ప్రాకింది.

ఆ పుణ్యక్షేత్రం సందడి తగ్గుతూండగా గోదావరిమీద సినిమా
డానికి ఓ ఫిలిం కంపెనీ వచ్చింది. దానికి పోటీగా మరో కంపెనీ

వచ్చింది. తారల్ని చూడడానికి, షూటింగులు చూడడానికి జ
వరదలా పొంగిపోయారు. రాత్రింబవళ్ళు రేవు రద్దీగా వుండేవి.

దానితో ధృవుడి దశ తిరిగింది. మంచి లాభాలు తీశాడు. లాభాన్ని చేపల వ్యాపారంలో పోశాడు. అందులోని లాభా
వ్యవసాయంలో పోశాడు. వ్యవసాయం లాభాలను వడ్డీవ్యాపారం పోశాడు.

రెండేళ్ళలో ధృవుడు ఎదిగిపోయాడు.

వూరికి దూరంగా వున్న పల్లె పాలెంలో చేపలు పట్టుక
ధృవుడు కాదిప్పుడు. వూరి మధ్యగా పూలతోటలో మూడంతస్
మేడవుంది. పొలాలున్నాయి. వ్యాపారాలున్నాయి.

ివుడు, లక్ష్మి కాన్వెంటులో చదువుకుంటున్నారు.

పుష్ప పూర్వం పదిరోజులకి చీర మార్చేది. ఇప్పుడు :
నిముషాలకి చీర మార్చెయ్యగలదు. కొత్త రకం నగలన్నీ ఆవె
వున్నాయి. నడవగల శక్తివున్నా నాలుగు కార్లు ఆమె శ్రమపడడా
ఒప్పుకోవు. అన్ని పనులకి మనుషులున్నారు. భర్తకు సలహాలి
దమే ఆమెకి మిగిలిన పని.

పాలుత్రాగిన లేగదూడ తల్లి చుట్టు పరుగిడుతున్నప్పు
కలిగే వుత్సాహం, ప్రమాదమైన పులిని వేటాడి బంధించి బోను
పెట్టాక వేటగాడు దగ్గరిలో నిలబడి చూస్తున్నప్పుడు కలిగే ధీమ
విశాలమైనా సముద్రంలోనైన ఈద గలిగే నైపుణ్యమున్న ఈతగా
ధైర్యం.........పుష్పలో వున్నాయి.

తొమ్మిది గంటలయింది. పుష్ప హాల్లో నౌకర్లకి పను
పురమాయిస్తుండగా షణ్ముగం "ధృవుడుగారున్నారమ్మా?" అంట
వచ్చాడు.

"అయ్యగార్ని పిలు." నౌకరుకి పురమాయించి. పమి
నిండుగా కప్పుకుని ప్రక్కగదిలోకి వెళ్ళిపోయింది.

"రండి మహానుభావా!" ధృవుడు మేడమీదకి దారితీస
ఆహ్వానించాడు.

పళ్ళ రసం త్రాగాక అసలు విషయం చెప్పాడు షణ్ముగ



109

ంబూద్రి సమితికి నిచ్చెనలు వేస్తున్నాడు. వాడికి బుద్ధిచెప్పే త్యర్థికోసం చూస్తున్నాం!"

"ఎవరయినా దొరికారా?"

"అద్దంలో చూపించనా మిమ్మల్ని!"

"నేనా! నాకు రాజకీయాలెందుకండి" ధృవుడు సిగ్గుపడి యాడు. మొహమాట పడిపోయాడు.

"అంటే మేమే పనికిరానివాళ్ళమన్నమాట" షణ్ముగం వ్వుతూ కోప్పడి "గ్రామం దృష్టి మీమీదే వుంది. నంబూద్రి తనం చెయ్యాలని పథకంవేసినా తిప్పికొట్టారు. సర్పంచ్ ఎన్ని లలోకూడ అలాగే తిప్పితిప్పి కొట్టండి. మీ ప్రతాపం చూపి ప్పట్లు కొడతాం" అన్నాడు.

"నాకు తీరిక ఎక్కడదండీ. ఇది కూడ ఎక్కడ భుజాన వేసు ను."

"తప్పదు. గ్రామం బరువు మీరు మొయ్యాల్సిందే. అది మీ డ్డ. కాదనకండి. పదవికూడ వుంటే మీకు పూర్తి శోభ! నంబూద్రి యంట్లోనుంచి బయటకి రాకూడదు."

బ్రతిమాలించుకుని ఒప్పుకున్నాడు ధృవుడు. షణ్ముగం ళ్ళిన వెంటనే భార్యని పిలిచి చెప్పాడు.

"ఇక దొరగారి దర్శనం కాదేమో!" ఓరగా నవ్వుతూ!

"మరో పాపాయి వచ్చేస్తోంది కదా.... అదే నీకు పెద్ద తోడు" మె బుగ్గలమీద చిటికవేసి క్రిందకి నడిచాడు హడావిడిగా.

పదిరోజులు గడిచాయి. వూరంతా ఎన్నికల వేడిలో వుంది. ంబూద్రి రూపాయలు వెదజల్లేస్తున్నాడు. ఇన్నాళ్ళు అతడు కింగ్ ేకర్. ఇప్పుడు తానే రాజుకావాలని దిగాడు. పరువు ప్రతిష్టలకి ంబంధించిన అంశం యిది. సర్పంచ్ అయితే చాలు సమితి న్నిక పెద్ద లెక్కలోనిదికాదు.

ధృవుడి పార్టీ హంగామా లేం చెయ్యడంలేదు. నంబూద్రి ప్పులని మాత్రం ప్రచారం చేస్తూవుంది.

డబ్బు ఏదయినా చేసెయ్యగలదని నంబూద్రి ధీమాగానే

ఓ. వెల చెల్లిస్తే దొరకని వస్తువేముంది? ఓటు నోటుకి
ం పెడుతుంది. పైగా మంచీ చెడూ తెలీని అజ్ఞానులైన ఓటర్లు
్రవ. వారి అజ్ఞానం శ్రీరామ రక్ష తమకి.

యెన్నిక పూర్తయింది. వార్డుల కౌంటింగ్ ప్రారంభమైంది.

మొదటి వార్డు నంబూద్రిది. ప్రత్యర్థిని స్వల్పంలో ఓడించి
ం సాధించాడు. విజయం తమదేననీ .ఆ పార్టీ చప్పట్లు
ంది.

మిగతా పన్నెండు వార్డులూ ధృవుడి పార్టీవే.

నంబూద్రి సీసంలా బిగిసిపోయిన ప్రక్క గదిలోకి ధృవుడ్ని
ిచాడు. "తప్పు చేశాను క్షమించు" అని చేతులు పట్టుకున్నాడు.

ధృవుడు తెల్లబోయాడు.

"ఆనాడు నా ప్రాణాలు కాపాడేవు. నేడు నా పదవి కాపాడు.
ంబరుకి లక్షరూపాయిల చొప్పున యిస్తాను" ప్రాధేయంగా
డిగాడు.

"ఆ రోజుల్లో నేను పల్లెమనిషిని. చేపలే నా ప్రపంచం.
బ్బుచేసే గారడీలు మీరే రుచి చూపించారు. ఆనాడు మీ ప్రాణాలు
ిలాలకోసం కాపాడలేదు. అది మానవ ధర్మం. ఈనాడు మిమ్మల్ని
పాడితే నన్ను నేను కాపాడుకోలేను. కొన్నాళ్ళు మేం మీరు
పిన ప్రజాసేవ నాటకం చూశాం. ఈ సారిమీరు ప్రేక్షకులు
వాలి. తప్పదు నంబూద్రిగారూ!"

నంబూద్రి శిలయిపోయాడు.

యుగయుగాల సాంఘిక వ్యవస్థలో దర్శనం, పర్షనం,
ప్రమాణం వున్నాయి. అందుకే చరిత్ర సంకోచం, వ్యాకోచం
ొందుతూ ముందుకు సాగిపోతూంటుంది, నిరంతరం.

వ్యక్తి, వ్యవస్థ ఎప్పుడూ ఒక సరిపోని తులాదండంలో
ుంటారు. కాలం వ్యక్తికేసి మొగ్గితే రాజరికం, వ్యవస్థకేసి మొగ్గితే
ప్రజాతంత్రం.

అధికారం ఇంద్రధనస్సులో సామాన్యుడికి రంగులు కన
పడతాయి. మేధావికి తెలుపు మాత్రమే కనిపిస్తుంది.

సామాన్యుడు, మేధావి ఒకే దిక్కు కేసి, ఒకే
ఆశించి, ఒకే లక్ష్యంతో నడిస్తే 'అధికారం' రూపం మా
టుంది. అధికారం వూసరవెల్లి.

"ఏం కావాలన్నా యిస్తారా ధృవుడూ? నీ యిష్టం...కాద
అతడి పాదాలముందు నంబూద్రి వాలిపోయాడు.

"మీకు సిగ్గులేకపోవచ్చు. ఇది నాకు సిగ్గుగా
ధృవుడు తలుపులు తీసి మెంబర్లున్న గదిలోకి నడిచాడు.

నంబూద్రి యిక అక్కడ వుండలేకపోయాడు. వె
దారిన వరండాలోకి వచ్చి వెళ్ళిపోడానికి రహస్యంగా.

మెట్లు దిగసాగేడు....దిగేడు.

"సర్పంచ్ ధృవుడూ....జిందాబాద్" అన్న కేకలు.

నంబూద్రి, కంటికి ముల్లు తగిలినట్లుంది.

కానీ, క్షత్రపధును దాని పిడినేమీ చెయ్యలేదు.



—: సమాప్తం :—

స్నేహానికి నిర్వచనం

శ్రీ వక్కలంక రామారావుకి

అంకితం

—రచయిత.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M112 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | .no |
| తయారు చేసినది | Sumitha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Sn. Ramya |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | [illegible] |